కోరాడ రామచంద్ర, 1816-1900

మంజరీమధుకరీయము

Masulipatam, 1908

Record no. 432

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

కోరాడ రామచంద్ర, 1816-1900.
మంజరీమధుకరీయము / కోరాడ రామచంద్ర ప్రణీతంబు నాటిక.- Masulipatam : C.M.S. Dove Press, 1908.
ii, 237 p. ;19 cm.
Record no. 432

Kōrāḍa Rāmacandra, 1816-1900.
Mañjarīmadhukarīyamu / Kōrāḍa Rāmacandra praṇītambu nāṭika.- Masulipatam : C.M.S. Dove Press, 1908.
ii, 237 p. ;19 cm.
Record no. 432

35 mm microfilm
Image placement: IA (IIA) IB IIB　　Date filming began:

# మంజరీమధుకరీయము.

శ్రీ కోరాడ రామచంద్ర ప్రణీతంబు నాటిక.

---

# MANJARIMADHUKARIAM

**A DRAMA**

BY

**KORADA RAMA CHENDRA SASTRI GARU**

*Late Senior Pundit, Noble College.*

EDITED BY

**his son**

***K. D. NAGESWARA***

***Senior Pundit, Noble College.***




---

**Masulipatam.**

**PRINTED AT THE C. M. S. "DOVE" PRESS.**

**1908.**



**Price Rs. 1-8-0.**

# Errata



| Page. | Line. | For This. | Read Thus. |
|---|---|---|---|
| 3 | 3 | సంప్ర | సుప్ర |
| 4 | 2 | ష్వని | ధ్వని |
| 4 | 14 | కృత | కృతు |
| 5 | 13 | చులీల | చుచునులీల |
| 9 | 26 | ధీవన | ధీన |
| 16 | 22 | కోడ | కోడం |
| 18 | 18 | తంల | తలం |
| 30 | 4 | యొడఱ | యొడలవ |
| 30 | 13 | నేసి | సేసి |
| 31 | 18 | లుపి్రయునిబ్రే | లుంబ్రియునిప్రే |
| డిటో | డిటో | నెద్ది | నద్ది |
| 32 | 1 | హవణి | హావణిక |
| 41 | 24 | చుది | చున్నది |
| 48 | 21 | సంయోగ | సమవాయ |
| 70 | 19 | యంత | యెంత |
| 73 | 21 | యది | యిది |
| 73 | 23 | ఐన | లీన |
| 79 | 4 | కటాకటా | కటకటా |
| 79 | 9 | జదివిచదివి | దమినిఁజదివి |
| 80 | 2 | రూపుఁమి | నేపుమి |
| 82 | 7 | విసంభం | విస్రింభం |
| 92 | 8 | ్రతిమ | ప్రతిమ |
| 95 | 15 | కుల | కులను |

| | | | |
|---|---|---|---|
| 96 | 22 | కుండు దే | కుండు జే |
| 105 | 9 | కీల్లి | కీదల్లి |
| 106 | 9 | బొగలు | బొగులు |
| 109 | 3 | రకు | జరకు |
| 110 | 5 | పధాన | ప్రధాన |
| 113 | 2 | వంశం | వశం |
| 130 | 8 | మెత్తనిది | మెత్తనది |
| 139 | 5 | ఖంజి | ఖంజీ |
| 156 | 4 | మహత్తా | మహత్తరతా |
| 186 | 2 | కాశలై | కాశవై |
| 189 | 15 | నిదయ | నిదియ |
| 193 | 10 | యా । పీ | యాం । ఙీ |
| 219 | 12 | విదిత | విదితం |
| 221 | 2 | నతిక్ష | నతిక్షీ |



ద్విపద॥ పల్లవితాశోక ...ంథమాణ॥ పల్లవాస్త్రప్రతా
...శుచిసంభరిత । ములపుష్పితాశేష భూరుహవ్యూహ । ములకైత
...ంబునం బురణించుకామ । యశములనలరారు నాశామతతుల॥ వశ
...దప్పినపాంథ వర్గానిలములు । పరభృతకలరావ పటిమసంధాన
...రభేషజామ్రప్రవాళాంకురములు॥ నవచూతకిసలాదనవిధూతమాం
...స్య । రవవిదళితపాంథ రాజికర్ణములు । తరుణకోరక పుష్పతతిగుచ్ఛ
...క్రమ॥ తరులతాసంశోభిత వనాంతరములు మలయబంధీకృత మా
...పతచరణ । విలగితశృంఖలా విచ్ఛేదకములు । వికచకానుముగుచ్ఛవిగ
...స్మరంద । నికరసిక్తామోదనిబిడాంతవనులు । తనువాతసముదితాత
...పుష్పరేణు । వినుతవితానాప్తి విలసదభ్రములు । సాహుయసాకేత
సంపన్నకుంజ । సీమంబులనుజేరి సేమంబులమర । సరసవిహారముల్స
లుపుచున్నట్టి । హారిణాక్షులరశనాహంసక ప్రముఖ । భూషణకంధరో
ద్భూతగంభీర । ఘోషణార్భటుల నాగోపితంబులుగ । నొనరించులీల
మత్కటమహిమ । దనరారుసమయ కృతప్రకృతిజని । మదకల శారి
కామధుపాన్యపుష్ట । మదనాశ్వముఖపత్రి మధురారవములు । తుహి
నాపగమమున దోచు సంపదల మహిమసొంపొందురమావాసకుసుమ
వనములవిహరించు వాగీశవాహ । ఘనచక్రసారస కారండవాది । జ
లవిహంగవ్రాత సంచితప్రచుర । కలనాదవాచాల కాసారకములు ।
మదకలమాతంగమహితఘీంకృతులు । ముదమొసంగుమృదంగపురు
రవంబులుగ । బహువిధవిహంగౌఘభవ్యరుతములు । బహు...
తాళ శబ్ద మధురంబులుగ । నవి... ...థయా...
విశేష సంగీత సంపదల్గాగ । ...
సూత్రధార సత్కామతను వి...
తంబుల సంపదలింపు ।
వింత దినములనెల్ల
శర్మమయంబులై

చ॥ సకలజనాభినందన్యములసద్గుణరూప మహావిభూతులం।
బ్రకటిత నవ్యభవ్యత మభాసుర హేలలభూరిసమ్మద। ప్రకరములిచ్చు
చున్నశుగ రాజిల జేసినకుందవల్లిక। న్వికలమ్మెనర్చిచేరె నళివింతగనెం
ప్పెడు చూతవల్లరిన్॥ ౧౮॥

వెండియు నిటలసంఘటిత కరసరోరుహ పుటుండగుచు మొక్క
చక్కని దృష్టింగూర్చి

సీ॥ సకలభువనవనజనివనస్థితిసముత్పాటనోత్కటమదార్భటిక
కరటి। పటుభుజబల సముద్భటని శాటభటౌఘరుధిరౌఘసంసేక రూ
షినవని। సంజ్వర మార్గంగి సదయత నవతరించిన కైటభద్వేషి ఘ
నుడు రామ। చంద్రుడు లక్ష్మణజనకజాసహితుండై బుధులెల్ల గొల్వగ
బోధమయత। నిటవసించుట సకల భద్రదేడితాత్ము। డైన యీభద్ర
గిరి నేసినట్టిపుణ్య। మొక్కటియకాదు శ్రుతిపురాణోక్తధర్మ। సంది
తాస్తిక్య జనపుణ్య సంచయంబు॥ ౧౯॥

సీ॥ అపరిమితబ్రహ్మహత్యాఘసంహతివిఘటిత ప్రాణుడౌవి
ఘ్ననాథు। బుత్రుగాంచి హిమాద్రిపుత్రికమిగుల శోకార్తయై ర
మణశిరోదరమున। నిఖిల వేదాంతార్థనిధియైన యేభవ్యనామామృ
తంబున నతనివీను। సిక్తంబుసేసి విముక్తనిద్రుని బోలెనుద్ధితుండౌను
తు నుద్ధవమున। గాంచెనట్టియ శేషలోక ప్రస్మృష్టిరక్షణావసాన సువిధా
నదక్షులలితు। డఖిలవేద శిఖార్థ సౌధాంతరాళ। దీపుడగు రామభ
... దివ్యుడితండె॥ ౨౦॥

...వణ్యకణావగిరి ...శరన్నిర్మలష్టజాడ్యోల్లస। ద్దివ
...నాభరంబజరాహారముగ్రోలి
...జనుల్వల్ల భగోష్ఠి కల్పనల

...గా నాసందంబు
...విదిత నామధే



...ంబు శుభయత్నో ద్రుతం కార్యయను కల్యాణధిషణా భాషణం
ననిష్టార్థ నిర్వహణంబుకై యవిలంబంబుగావచ్చింపవలయుననినేప
థ్యభిముఖంబుగం బరికించి సంకేతం బొనరించుచున్నాడు.

(ప్రవేశించి పారిపార్శ్వికుడు) ఓయీభావా యిదియేమి? సముది
తరణికిరణ సరస్పృష్ట విమలకముల విభాసమానంబగు నీయాననంబు
సంతాసంతతంబై హిమానీసంవళితంబగు సహస్రదళం బనుకరించు
చున్నది.

సూ॥ ఓయీ మారిషుడా యిప్పుడు చతుష్షష్టి కళావిమల
మణిశ్రేణీగుంభిత హారాలంకృత హృదయులు సదయులుసరసకవితా
...భావనాణులును నీయంతర్వాణుల సమక్షంబున సక్షీణ విచక్ష
ణత సమగ్ర సమ్మద ప్రాపకంబగు రూపకంబభినయింపవలయు, అది
యెద్దియని నామనంబు చింతించుచున్నది।

మా॥ ఓయిభావా అట్లకానిమ్ము విచారంబునకుం గారణంబే
...? అనవద్య సకలవిద్యా నిషద్యాయమాన రసనారంగ నానట్య
మాన సరస్వతులును సమగ్రక వనధోరణీ మహానిర్ఝరిణీ సరస్వతు
...కాళిదాస భవభూతి ప్రభృతులు భువన జనోపకారార్థంబుగ
...ప్రబంధంబులు సకలసత్పద సంబంధంబులు పెక్కులు రచి
...ంచియుండిరిగదా!

సూ॥ ఔను స్వేచ్ఛాలాపన మానాకాగసం స్పృష్టవిస్పష్ట గుణా
...కార రసాత్మకవివిధ ప్రబంధ బంధురములగు నాయా కవితాధుర
...భూరిభేదప్రబంధంబుల నేనెఱుంగుదు — ఆ కవిశిఖామ
...తంబులగు రూపకంబులెల్లం దఱుచుగ నీసభాస్తారులు
...ం బరికించియుందురు. అక్కతంబుననే కాంబోలు వా
...న్యాభిలాషంబై చూపట్టు। వారియానతియైనయీటి
...రూపకంబును ప్రాయికంబుగ గానబడమి ననుత
...గాన నాచేతంబు నితాంతచింతా క్రాంతంబగ

మా॥ ఓయార్యా యద్దినీకెట్లు విదితంబయ్యె.

సూ॥ సకలదోషదస్యులగు నాసదస్యులుగై సేసిన పత్రికా. లోకనంబున

మా॥ దానిం బఠింపుము.

సూ॥ పఠింపుచున్నాడు క॥ ఆద్యప్రకృతివికృతులఁ। జోద్యంబులుబహువిధములు సూచితిమిమహో। విద్యాధికరూపకముల। హృద్యాద్య ప్రకృతివికృతి హితరూపకముల్ ॥ ౨౨ ॥

క॥ శుచిమయరసబహుళంబును। శుచిమయహృదయావనీశ శుభచరితంబున్। నిచితగుణాలంకారము। రుచిరంబగు రూపకముని రూపింపఁదగున్ ॥ ౨౩ ॥

మా॥ ఓయార్యా యట్లయినం జింతింపనేటికి?

సూ॥ అట్టిరూపకంబుగలదా?

మా॥ మున్ను మనమా యాసహాధ్యాయులతోడం గూడి దానిం జదివితిమి గదా?

సూ॥ సాశ్చర్యంబుగ తాదృశంబగు రూపకం బెక్కడిది

మా॥ సస్మితంబుగ వినిపించెద నాలింపుము

సీ॥ కారణపురుషాది కారణంబగుపర దేవతామణిగాఢ తీవ్ర
నియమ। దుశ్చరతరమహా పురశ్చరణంబున నంచిత కరుణారసాప్తు తా
లుచు దృగ్విషయమై యధిక వత్సలత నిజేష్టమెఱింగింపు మెల
నాత్మీయవంశజులా సప్తమావధి సకలశాస్త్రాగమ పఠనులగు
మెవలననిష్టపూరితుఁడయి। వెలయు కౌండిన్యగోత్రప
తకోరాడవంశ నిర్మలమణియయి। దీప్తి విలసిల్లె నమ్మ
౨౪ ॥

సంతతి వైభవుండగు నమ్మహాదేవశాస్త్రికి నమల
వసింధు తారకశ్రీరామ మంత్రజపామల మతికి



లక్ష్మి। నాగమవేత్తకు నగ్రతనూజుండు శ్రీశిష్ట వంశాబ్ధిశిశిరకరుఁడు సకలవిద్యాజన్మ సద్మాయమానజిహ్వాంచలుఁడమిత కావ్యాళికర్త। యయిన శ్రీకృష్ణమూర్తి పదాబ్జసేవ నాత్త సద్గ్రంథ కల్పనావిత్త సుమతి। విరచిత శ్రవ్యదృశ్యాత్మ వివిధకావ్యుఁ డయిన యారామచంద్రుఁ డార్యాళి వసుఁడు ॥ ౨౫॥

వ॥ మఱియుం బహుల గుణంబుల ననేక లేఖనీ విలేఖిత హృద్య పద్యావళిసంతోషిత పరజన స్వాంతుండగు నతండొక్కనాడు నానావిధ ప్రబంధ ప్రకారంబులు గోష్ఠీవశంబునం దలపోయుచు దృశ్యశ్రవ్యకథామయంబులగు కావ్యంబుల శ్రవ్యమాత్రంబుల సవిశేషవిశేష సుషమంబులయి మహాకవులచే ద్రిలింగభాషయందు గ్రథితంబులుగఁ దృశ్యంబులగు నవి తాదృశంబులు గామికిం జింతించి తద్గ్రథన నిషేధ కారణంబు గానక మరియు నారూపకంబులందత్తత్పాత్ర విశేషంబులకుం బ్రాకృత భాషరూపకానుశాసన విహితంబయ్యును వసంత తిలకవల్లవీ హల్లకోల్లాస శృంగార రంగాదిభాణంబులు రూపక విశేషంబులయ్యును బ్రాకృత మిశ్రంబులు గాక ననిమిష భాషయందు సవిశేషంబుగఁ జూపట్టుటన్ మరియు మిశ్రంబులయందు గ్రథితంబగు ప్రాకృతంబును ఛాయవీడి సకల జనంబులకానంద విధాయకంబుగా నేరమింతియకాక నామిశ్ర రూపకంబులయందును నొక్కొక్క చక్కిం బ్రాకృత వ్యవహార యోగ్యంబులయిన పాత్రంబులును సంస్కృతం బాశ్రయించి వచించుటయుం బొడసూపుటవలన నాప్రాకృతభాష లేశియత్యంత నిషేధాపాదకంబు గాదని తలంచి పంచితోత్సాహుండయి సంస్కృతాంధ్ర మిశ్రంబుగాఁ బ్రాచీనానుశాసనోక్తలక్షణ లక్షితంబగు నటుల సకల సరసపదార్థకుసుమ వనీవాటియగు మంజరీ మధుకరీయంబను నాటిక విరచించి మనకుం గైసేసెఁగదా।

సూ॥ సవిస్మయానందంబుగ। ఆహా నాయనవధానత। అకారణకరుణారమణిం బరిణయించి యమితకీర్తి సంగత పరోపకృత లలిత క్రీడల నమందంబగు నానందంబు నొంది యస్తోక విశదగుణ సంస్తవ్యయశ స్తోమసంతాన సంతానంబులం గని వానిచే నాతరణిహరిణ కిరణంబుగ నిజాభిజననంబు వర్ధిష్ణువుం జేయుపుణ్య వదగ్రిణ్యులకు నేయేభువనంబుల నేయేవిబుధనాథ సన్నిధానంబున నెట్టెట్టు కళ్యాణసుఖంబులు గలుగునో యను నధ్యాహారాధీన మనస్కతవిస్మృతినొందినను లెస్సగ ననుస్మారితుండనైతి

కాన నిపుడఖిల సద్గుణగణంబుల నిభ్యులగు సభ్యుల సద్భావంబునం బ్రార్థించెద, అని పరివర్తనంబొనరించి యుచితోచిత పరిస్థితియగుచు॥

చ॥ సకలకలావిచక్షణులు సద్గుణ పుష్పబు ధావనీరుహు। ల్వికసిత సంశ్రితాను లు నవీనకృతీహులునైనమీరలు । త్సుకతఁగడుంగనుంగొనగ శోభిలునంచను నైననా కుహూపక పరిపాటివేఁడెదను వారకమీరలను గ్రహింపుడీ ౨౬॥

గగనంబునవీనుండాల్చి యేమి యానతిచ్చిరి సదస్యచతురాస్యులారా॥

సదస్యులు॥

గీ॥ నీవిటులమమ్ము వేఁడుటనీతి నిపుణ । దూరదూరాధ్వచంక్రమణోరుఖేద। మునను బానీయ కాంక్షికి మోదమొదవ।విందు సేయుట గాదొక్కొ విందువమరి॥ ౨౭॥

మారిషుఁడు॥ ఓయిభావామనభాగధేయ మహీరుహంబీ యెడఁగదామిగుల నామూలచూడ ఫలితంబు । ఎందునుండియని యను యోగించెదవా యవధరింపవ య్యా। మనకుం గమనీయంబగు మహనీయ పరికరప్రకరంబున కొక్కింతయైనం గొఱంత చిరంతన కధాప్రాయంబయ్యెఁ గనుంగొనుము॥

ఉ॥ ఈసమయంబశేషకుసుమేడిత గంధక గంధవాహకం। బీసభకున్మహోమహ మహితనకూరమణుండువల్లభుం।డీసభవారు వాక్పతి సమీడ్యకలావిభవాభిరాములా యాసకల ప్రకారనట నాగమ సింధు విలంఘనోద్భటుల్॥ ౨౮॥

క॥ అనిర్యోన్న విదితులుగదా । మనవారందఱును మిగులమహితకృతిశ్రీ వనిత యు సముచితరీతి। ధ్వనితల సద్వృత్తికృప్త ధన్యాశయమే॥ ౨౯॥

సూ॥ సప్రమోదంబుగ। ఔనోయిభావా నీవునక్కణ నేసినదంతయునిక్కం బ। అదియెట్లన్నను॥

క॥ పరసంతోషణకృతి తత్పరత న్వర్తిల్లుసుజనపాలికి సుగుణా । కరసమ భిమతార్థంబులు । పరదిష్టముచే లభించు బహుదూరములన్॥ ౩౦॥

ఇద్దియెట్లనుచున్నావా కనుంగొనుము॥

ఉ॥ కంధిగభీరఘోర తరగర్భవిలీన వృషీకధోరణీ। సంధిత దుష్కవాటఘ న శౌక్తిక మౌక్తిక జాలమెక్కడన్ బంధురభూమికుక్షిజ సుపర్ణము నెక్కడ నవ్వి పద్మినీ। బంధుకృతాంధ్య యావతవిభాసుర ధామము తోడగూడవే॥౩౧॥



సూ॥ శహబాసు భావాతత్త్వ వేత్తవయితివోయి - అయ్యర్థంబట్టిదయ- విలం బంబన లంబితంబడినదేని భావిభావుకవ్యూహంబులకుం బ్రత్యూహంబుగాఁగల దు- గానవవిలంబితంబుగ సమంత తస్సం క్రాంతనిజగుణసౌభాగ్య కాంతంబగుప్రి కృత వసంత వనీకాంతంబధికరించి గానంబనూన గుణనిధానంబుగ నొనరింప వక్కా ణింపందగు।

సూ। నేపథ్యాభిముఖుంబుగ- చెలియకో సంగీత శారికా॥

సం॥ ఏమయ్యా ఓయార్యా యిచ్చటనుంటినయ్యా॥

సూ। మారిషభాషణంబులకు నీశ్రవణంబులు శరణంబులయ్యెనా॥

సం॥ ఆర్య వేఱుగఁజెప్ప నేల ఇద్దియయుత్తరంబైయొప్పు॥

ద్విపద॥ తనకు మేల్తఱిగాగ దనరినసిరుల। నెనలేని సొబగుల నెడపకమించి। ముద్దుల నొసగెడి మొల్లలతోట । హద్దుమీఱిన వేడ్కఁ నదనులఁబుచ్చి । తనచెలి మేల్బంతి తామరతీవె। యెనసిన యివమంత యింతయిపోవ॥ యామనిరాకచే నలతి గానట్టి। యేమరమిని బూనియెలమినిజేయు । సొంపులగుంపుల జూచువారలకు । నిం పులౌ వేడ్కల నిడుచున్న దనుచుఁ। దావిమో తరిసేరి తనకెఱుగింప వావిరివేడుకపడి దానిఁజూడ।మసునిసింగానికి మఱియు సురిడుచు। వరలు తేటులబారువచ్చెదానికడ॥

సూ॥ మఘ్ఘూ మఘ్ఘూ- ఆశ్చర్య రసార్ణవంబిప్పు డతివేలంబతి వేలం బగుచున్నది - ఎప్పొంటె నంటివేని- తనకుమారీ కుంజరియగుమంజరి బాల్యాపగమ నంబున నంకురత్తారుణ్య లక్షణంబుల వీక్షణలక్ష్మియగుటం బరికించి యానందరం గదంతరంగ యగుచు శృంగారవల్లి సల్లీలా మతల్లియంపిన దూతచే నాహూ తయై యాత్మీయ వయస్యావలోకన కుతూహల తనాయాత యగు నామోదరేఖ వృ త్తాంతంబు ప్రాకరణికంబై నాయంతః కరణంబుననుండె దానికనుకూలంబుగ నకదా యీధ్రువ గానవిషయంబై యొనరింపంబడినది- అని సంగీత శారికనవలోకించి - బాపు రేసంగీత శారిక బాపురే ।

మా॥ ఓయిభావా యిద్దియెట్టి విస్మయంబు - పరేంగి తజ్ఞాన ఫలకంబగు బుద్ధి చే నిద్ధస్వాంతులగు వారలకు నిసర్గంబకదా

సూ॥ అట్టిబుద్ధిసత్త్వకయ విస్మయంబు గలుగుచున్నదంటివి ని ।

మా॥ అద్దియిప్పుడభినవంబె।

సూ॥ గుణంబుచిత సమయంబునంగి జేయింపందగుంగదా।

మా॥ జౌనిద్ది తథ్యంబ అనిపరివృత్త్యవలోకనంబొనరించి-ఓయిభావా భర్తృదారికయగు మంజరి భూమికంబరిగ్రహించి చంద్రరేఖయుం దదీయ వయస్యయగు నామోద రేఖావేష ధారిణియగుచుం దరంగిణియు నిట్లయే తెంచుచున్నారు-కాఁబట్టి మనము ననంతర నిర్వహణీయ కార్య నిర్వహణంబుకై యత్నింప వలయునని యక్కడనుండి వెడలిరి ॥ ౩౨ ॥

ఇద్దిప్రస్తావన ॥ శ్రీ శ్రీ ॥ అనంతరంబున మంజరియు నామోదరేఖయుం బ్రవేశించుచున్నారు।

ఆ॥ హలామంజరి సుమాళంబుగ నుంటివిగదా।

మం॥ అత్తిక నీవచ్చుట నింక నింకని యద్దిగలుగునని నెమ్మనంబున నేనస్మిదనే॥

ఆ॥ హలాయిట్లంటివేమే ।

మం॥ అత్తికా నీవు నాచెంగట నుంటివే।

ఆ॥ హలా నీ కురంగట నవ్వమొదలుగల వారండఱున్నారుగదా।

మం॥ అత్తిక యీయవ్వ తొల్లింటి యవ్వయనుకొంటవే ।

ఆ॥ ఇపుడు క్రొత్తగ మఱియొకతె యేతెంచెనే।

మం॥ కాదే యవ్వయయిన యద్దియేకాని దానియాత్మమారనదే ।

ఆ। ఓసిచెలియా కాదే తొల్లింటికంటె నీయాత్మమారినదే - దానినెఱుంగకయమ్మను వితగదూరుచున్నావే।

మం॥ అత్తికా । నీవుకొన్నినాడులు డడవున నుండుటనీయాత్మ యుండాఱుమాఱియ్యెనని తలంపందగునే ।

ఆ॥ స్వగతంబుగ। ఈచెలి పలుకుల కిపుడ యడ్డం బొడగూర్పం దగదు! కొంతదడవు దీని నుడువుల కొడంబడునట్లుండ వలయు - సప్రకాశంబుగ ఓసీ యవ్వయాత్మదడబడెనని కడునిక్కంబుగ నుడివెడవుకదా అద్దియెట్లొ నాకుందెలియ వక్కాణింపుమీ ।



మం॥ అక్కరో యట్టనుగ వేచెప్పద - పమ్మటనామాట బూటకంబు గాదని నీకతేటపడు- నాదశయంతయు వచించెద హావణిక నాలింపుము ।

క॥ చెలినీవూరికి వెడలుట। దొలిగా నాయెదనుమిగులదొడుగుఁ దోరం। బులునల్లని ముక్కుల మఱిలలి బంగరు బొంగరంబులాగునఁ గంతుల్ ॥ ౩౨ ॥

క ॥ పొక్కిలి మిక్కిలి లోతగుఁ। జెక్కులులస్మెరుపు వొడమె చెలివెడదతనం। బక్కునఁగానున జిక్కుటనిక్కంబిదియేమికింకొ నెఱినాఱయుమీ ॥ ౩౩ ॥

క॥ మును నాయువరము సూచితె । వనజాక్షిరొ పచ్చపట్టుబాతిగనుండుణ్। కనుమిపుడిచ్చటఁ బొడమెను। దనువగు నలనల్లత్రాచు తరముగ నేడుణ్ ॥ ౩౪ ॥

క । పిరుదులుఁగడుబరువులగుం। జరణంబులు నడలయందుఁ జడజడములగున్। సరిలేని బలుపు నమరెడుఁ। గురువులు మఱిగురువులగుచుఁ గోమలికంచే ౩౫ ।

క ॥ పుట్టొంది ప్రొద్దుపొద్దున। నట్టొండక పెంపుజెంద నవకము మీఱణ్। బట్టురవిక యొత్తుటచే। గట్టిగ నావెన్ను నవసిగాసియొసంగుణ్ ॥ ౩౬ ॥

క॥ తొలితొడంబయ్యును వెత। గలిగవ యెడ నాకు నవ్వగడునంతలచే। నడరెడిది యట్టిదిపుడ । క్రిలిఁజూడదు వినియు నగును మీఱిన వేడ్కణ్ ॥ ౩౭ ॥

గీ॥ ఎదకు నీవెక్కురులు వంతలిడునవైన । నగల మిగులంగజెందను వాసిమీఱ । వెక్కురులు సూపిమందిడి వేగమనుపు । మనినవిని తెలినగుటకునడరుదుగడు ॥ ౩౮ ॥

వ ॥ మరియు మన యన్వ నవతయంతయు వింతయై గానంబడు-అది యెట్లంటివేని మునుపు నేనెప్పుడెప్పుడు సాటిబోటులం గూడి సయ్యాటంబులు సలుపువేళల నయ్యాకేళీ వశంబున వలువలు మాసినంగైసేత సెవరెనను మిగులంగనలి గద్దించుచుండు - మఱియునుం దినువున నెప్పుడైన నొక్క వెక్కురు నిక్కంబై గానంబడిన దానికిం బెక్కులగు నుపచారంబులం గల్పించు - ఇప్పుడు కింకచే బింకంబుసెడి యలసి సొలసి యీబాదకతం బాలోచించి మందుదెప్పించి యిప్పింపుమని పనిఁబూని బతిమాలిన వీనుసారనీదు - మఱియు నదనంబులగు నీకదుముల రాయిడి వెలమించు నాకంచెలు పటాపంచెలుగా వంచితంబులు గాగంగని నవనవంబులయి

పెలుచు వెలవెలయు నానందెప్పించి యిచ్చుంగాని లోనికి మందొసంగింపదు- వెలిక గట్టిగఁబట్టియినం బట్టింపదు- పథ్యంబును జేయింపదు అనుటయు నప్పుడా యామో వరేఖ యిట్లుదిత యౌవనయగు నావయస్యకులుకు లనలరు పలుకుల నిలింపాహార రస ధారలంబోలి వీనుల నానుచుఁ దినమనంబున ।

క॥ తనువనికి సురభిసమయము। తనువిభ్రమములకు దోహదశ్రీవిభవం। బును రతిపల్లికి గందము। ననునగుజవ్వనము చూవె యవనిదలంపక ॥ ౩౯ ॥

గీ॥ మధుపుకంటె నధికమైన మదనిదాన। మకనకమణిమయంబైన మహితభూష । మంత్రసంస్కార రహితసుమాస్త్రి విజయ లగ్నకాస్త్రము యౌవనలలితలక్ష్మి॥౪౦॥

క॥ సంతసములఁగడునీనుచు । వింతగబొడసూపునొడలి వేడుకచిన్నె' ల్సం తసిలక యీచిఱుతుక। వంతలఁజేయునవి యనుచు నగలఁగలంగుక ॥౪౧॥

క॥ తొడవులుగఁ బొడముగుబ్బల । నడపడి నెడవెడదయగుచు నయికల్మి యగుక। నడుమనయ మనయసంపద । వడువునగడు బడలియున్న వన్నియలీనుక॥ ౪౨ ॥

సీ॥ మరుని టెక్కెపు సొంపు మఱలించుఁ గన్గవ . గన్బొమలతని సింగాని సొబగు । మోమునందమతని మొదటి ముల్కులకల్మి మోవియాతని తేజిబువ్వపండు పల్వరసయతని నాల్వతూపులగుంపు నవతనిమామ విన్నాణపుసిరి । కుత్తుకాతని గెల్వు గొనియాడుచిందము గైలునాతని తొలికాలుతూపు । లెదవుట్టుపులువాని యెలమి బొంగరములు మఱివేలుపుల తావుమల నిసువులు । గొదలువానిసింగారంపుటద్దములీవ్ నుల తనియవ్వ వెలయురూపు। వేనలికల్మి యాబిరుదు సొంపగు నల్లె బుజములాతని తోటఁబోలుచుతీవ। లారుతీరాతని యడిదంపు తీవియకౌను నాతని యయ్యకడిదియ డుగు। పొక్కిలి యతని ప్వాల్వొసగు కేళాకూళిపిరుదులాతని తేరు పేరుటజ్జు । కురు వులాతనితావుగూర్చిన యనటులఁదనరు పిక్కలువాని తరకసములు। నడుగులు నాని రెండవమూడవ మ్ములగోరులాతని యత్తలారుసిరుల॥ నట్లు గావున నిదిమది నరయఁ బొడము।పరువమున బొల్చుచెలువమే పారసంజ। కడను గన్పట్టునెలవెల్గుకల్మి నెగడు। వేలుపులత్రోవ చాడ్పున వెలయునుగడు॥ ౪౩॥



గీ॥ అహహ యజ్ఞాతయౌవనయైనదీని। పలుకులలకల కండలపలుకులరుచి। కఱములను వేలుపుల బువ్వకరణిఁ దెగడి। మనమునకు నిర్భరానంద మహిమ సేయు॥ ౪౪

ఇట్లుండ నేపథ్యంబున ఓసికనకాంగీ యయ్యగారు తన పుట్టింటనుండి యామోపరేఖ యేతెంచి యమ్మాయిగారి యొద్దనున్నదని యాలకించి యప్పటి సేమంబుల రయ విచ్చేయుమన్నారు-కాని మీరందరును హాపణికగనుండుడు-దారులందొలగుఁడు వేగంబతొలగుఁడు॥

కనకాంగి॥ ఓసిచంద్రానా యావునేయనుచు నందఱుగలసి తమ కుచితంబుగ నచ్చటచ్చట నుంచున్నారు॥

సీ॥ ఘనసారమృగమద ఘనసారవీటికా సురభి పురోద్భవగస్ఫురణఁదెలుపఁ । జరణవిన్యాసముఖ రనూపురంబులు మదహంస కూజిత మధురిమగన। లలిత వేల్లిత భుజావలయ శింజితముల శ్రవణ మంగళపాళు లవతరింప। రసకుంభ కుంభదురసిజదుర్భర భరాధరణ దక్షింబయి నడకనడుము । నిజవదనోద్యదంబు జచిదాగత భృంగములు ఘ్రాణచంప కాకలనఁ దొలగ। ద్విజ్మరీచిస్ఫూర్తి దిశల నీలాంబుజ నిజసంచిత శ్రీల రాసులొసగఁ। దనులిప్తమహిత చందన గంధ సంబంధమున గంధవహ మద్ధితను జెలంగ।యావకార్ద్రపదవిన్యాస చిహ్నంబులు ననహల్లక శ్రీలనవనికొసగ।కంధరాధార ముక్తాహారదీప్తులుకౌముదీ సంచారకలన లీన। గమన వైచిత్ర్యంబు లమలచ్ఛందంబుల మదగజంబులమాద్రిమదమడంప। పరిపీవరనితంబ భారసంవహనజాయాసనిదాఘపయఃకణాళి। లలితచేటీ కరాకలితజ లార్ద్రాంచ దనిల శాంబకపిపాసాస్తినుడుప। బంధుకుశలాసబోధ సంవర్ధమాన। కుతుక బాలాతపావేశ వితతదీప్తి । నుహితవదనాంబుజ శ్లాఘమానరూప।యగుచు వెల్వడునారాజ హరిణనయన॥ ౪౫॥

అమో॥ హాళాయమ్మ యేతెంచుచున్నది గాన నీనుడువుల నిపుడు నిలుపుము॥

మం॥ అత్తికా ఉన్నమాటకేమి జలుకే- అమ్మయెదుట నేనే వచించెదను నిక్కంబుగ నాలింపవే।

ఆ॥ హళా నీవచనంబులన్నియు నాను విదితంబులయ్యె నేనే యవ్వ

తో నాలోచించెదను గాని కొంత సేపూరకుండుము - అని తదీయచరణాంబుజ గుంజన్మంజుల మంజీరశింజితాది శ్రీపణప్రముఖలింగంబుల నాదేవి నతి సమీపగతం గానెఱింగి తనకేల నాచెలికయిం గీల్కొల్పి యెదురుగంజని యామెయడుగులను గెందామరలకు నిజనిటలనయన విరచితమృగ మదకజ్జల గంధంబున నిందిందిరసంగతశ్రీవెలయుంబ్రిణ మిల్లుచున్నది - దేవి - సప్రేమంబుగ సముచితాశీర్సుఖరముఖర విబోధిత తామరస యగుచు నెత్తి గాఢాలింగనం బొనర్చి గండంబులం జుంబించి, ఓనాపట్టీ యెన్నిదినంబులకు నాకన్నులకుం గర్పూరకలికవైతివే.

ఆ॥ ఓయవ్వా నీయవ్వ నాకట్టిభాగ్యంబు నేటికిఁగలుగఁజేసెనే- ఇత్యాద్యుక్తుల నభినందించుచు వారందఱు విహారశాలంజేరి సముచితాసనంబుల యధార్హంబుగ నుపవిశించుచున్నారు-

దే. ఓసిపట్టిరో ॥

చం॥ తనదు కృపాణవల్లి విమతాసృగనార తపాన మత్తయై। దనరుపిధానగేహమున దాసుఖవిశ్రమమొందవేడ్కనా। యనతన యుల్లయంబుననిజార్థములన్నెర। వేర్పపండితా। యనసభ ధర్మసంహితల హాయిగఁ బ్రొద్దులుపుచ్చునేకదా ॥౪౬॥

ఉ॥ నూతన యౌవనంబున వినోదపరత్వము నంబుధానళీ।ఘాతగురంతచింతన। లఁ దూలకతాలిమికల్మినిచ్చలుల్ శాతమనీష ధర్మనయ శాస్త్రరతిన్గురు భక్తులైహిత వ్రాతరిరక్షనుందురె విరాజగురుక్రమరీతి సోదరుల్॥ ౪౭॥

క॥ జనకుండానతియిచ్చిన। వినయంబునఁ బూనిసుతులువెసనాకృతుల। న్మనమునకు నెలమి మిగులగ। నయము నెరవేర్చి యతని నలరించెదరే॥ ౪౮॥

గీ॥ అంబలక్ష్మీ సమారాధనాది నియతి। విగుల నలసతసెందక వేడ్కలమర పూజ్యకృత్యమ్ములెల్లవిబోధ మహిత। యగుచువెలయించుచున్నెనైయత్యమమర॥౪౯॥

శా॥ కోడ ండ్రందరు నైకమత్యపరులై కొండాడఁ గానర్హమా నాడెం బొప్పుసుశీల వృత్తులయి సన్నాహంబుతో నిత్యము। న్వీడెంబాదిగ నూపచారములతో వేడ్కందగంజేరివే। చూడాం చత్తది తాజ్ఞలైజననికిం జూపింతురయ్యిష్టముల్ ॥౫౦॥

శా॥ రాజ్యాంగంబులునెల్ల సారవిభవా రామంబులై యొప్పనే। పాణిజ్యానం



దముతోడం గూడి సుజనప్రాజ్ఞైన మాయప్పనుం। బూజ్యాత్ముండని యాత్మనెంతురె మహామోదా వృతస్వాంతులై। హ్యాజ్యాయోజిత యత్నులైన కుజను ల్వ్యావహన్యమానుల్గదా ॥ ౫౧ ॥

ఆమో॥ ఓమహారాజ బిడ్డా జస్తనూజానీవీరపత్ని విదుషీమ తల్లి నీయనుయోగంబు లెల్లవిదిత సత్యయోగంబులగుటం దద్దైవపదార్థోత్తరంబులై విలసిల్లుచున్నవమ్మా- దేవి-సానందంబుగ - ఓపట్టీ నీవువారివారిభావు కోదంతంబు విదితంబు సేయుట నాడెందంబు సురాహార సరసీని మజ్జనంబూని మిగుల నెలమివెలయుచున్నదే॥

ఆ॥ ఓయమ్మా యిదియేమి క్రొత్త యాప్త జనకుశలవార్తా- శ్రవణంబకాదా శ్రవణానందరసాయనంబు.

దేవి॥ బాలగో నారివర్ణనంబులు విన వీనులు మిగులం గుతూహలంబు నొందుచున్నవే॥

ఆ॥ ప్రధానంబులగు పతివచనంబుల వచించెద నాలింపుము.

ఉ॥ తాతపరితాపహారి విమతవ్రజ సత్త్వర వారిభంగసం। ధాత మహార్వపప్త శిఖదాయ భుజంబగుచు న్వెలుంగదు।ప్పాత తమోభర స్ఫురణ పర్వతకుత్సులయందకన్పడుల్। స్ఫాతదురంత పంకకృత సంకట కోటులువీచి కూటముల్॥ ౫౨॥

మత్తకోకిల॥ నీదుసోదరులెల్ల నెల్లడ నీతిభూషణ వృత్తులై। సాదరంబుగ సత్కవీశ్వర సారవాక్సుధ గ్రోలుచు। న్వాదశీలుర గెల్చుచు న్బుణవాదిగోష్ఠుల మీఱుచు। న్వాదితార్త్యను జీవులై సరసాశయుల్గడు నుందురే ॥౫౩ ॥

క॥ రాముని పోలికఁ దనయులు। నేమంబున జనకునాజ్ఞ నెటుమన్నింపం గామింతురైన నాతఁడు। రామావశుడఁగుట పఙ్క్తిరథి గాఁడుసుమీ ॥ ౫౪ ॥

గీ॥ అవ్వ సమ్మదమయ చిత్తయగుట నవిది। తాధిపతిదేవతార్చ నాహ్లాదితమతి। మిగులు తటివిదుషులఁ గూడిమిగుల వేడ్కఁ।బుణ్యగోష్ఠుల నుండును బూతవృత్తి॥౫౫॥

గీ॥ అత్తదయఁ బడయంగ మహార్థలాభ। బుద్ధినన్యోన్యబద్ధ ప్రభూతగాఢ మత్సరంబున నుపచార మహితవిధుల। వెలయుచుండియుఁ గోడండ్రభిన్న మతులు ॥౫౬ ॥

దేవి॥ ఓపట్టీ- యిది యట్లుండనిమ్ము.

ఆ॥ వీని వలన మేలకాని సేగించుక। యేని లేదటంచు నెన్నిమార్లు। నుడివి యున్నవినగ నూల్కొనదింతైన। నేను దీని వంత నేలఁ జెరుప॥ ౭౨॥

క॥ నిబ్బితి విడినే నెన్నడు। నిబ్బరముగ వీని నిజము నేరుపనేరం। దబ్బిబ్బు పడకయుండగ। గబ్బితనంబునను దెల్పి గావుము దీనిన్॥ ౭౩॥

ఆమో। ఓయమ్మా యౌనమ్మా నీమాట నయములమాటలైయె పాటింపఁదగు.

క॥ శిక్షకులెప్పుడు శిష్యుల। కక్షయమగు ప్రేమయున్న నదిమనమున నే। దక్షతను దాచి దానిని। రక్షణచేఁదగు నదనలరాజింపఁదగున్॥ ౭౪॥

మరియును.

చ॥ గురుజను లిట్లు జవ్వనపుగుర్తు లసాజముల న్ఫలంబులఁ। గురుకొని పిన్నవారలకు గోరిక మీఱవచింపుటొప్పగా। దరయన నైన వారులఘుతాహిత చిత్తులయైప్రమత్తులై। కరము నయంబువీడి తమకంబున నెంతురు నాటివారగన్॥ ౭౫॥

కావునను.

గీ॥ ఇట్టి మర్మపు సంగతు లిష్టసఖుల। వలన దెలియంగ వలయును వలనుమీఱఁ। గానవావలనన యిద్ది గౌతుకంబు। దనరనాలించి సుఖగావు తనుతమతిని॥ ౭౬

మ॥ చెలికారంబునఁ బట్టినెట్టి కతలన్ శ్రీమంతులు న్నిస్వులు। న్బలవత్తారతమంబులుండినఁ గడు న్వానింది గందొ్రచిని। శ్చల విస్రంభమునం బరస్పరమ శేషాఖ్యా తర్కాహస్యులై। విలసన్మైత్రిఁ బవిత్రవృత్తులయి యెవ్వేళ న్వసింపందగున్॥ ౭౭॥

గీ॥ కాననోతల్లి మేము సంగాతులగుట। వలయు పలుకులఁ బలుకుట వెలికిఁ గాదు। కావునఁ దనరు వితములు గారవమునఁ। జెప్పిదీని మనంబున కొప్పునేతు॥ ౭౮॥

దేవి॥ ఓసి- నాకూనా-నీవెంతనీతిమంతురాలవే-నాయాశయం బంతయు వింతవిడి వచించితివి-తొల్లినాయమ్మనాకు- నయమ్ములు ననయమ్ము గరపునపుడీ-యరతిమ్ములన నిట్లు వచించేగదా॥

క॥ నెచ్చెలుల తోడనైనను। విచ్చలవిడి గ్రామ్య కథలు వీడంగఁదగున్। నెచ్చెరవగ వేతెంచిన। నచ్చపురదముల దృగవిషయంబుల జేయన్॥ ౭౯॥

కావున నేను దీని జడుపువెడలింపం బ్రోడగానైతిని - కాననీవ దీనికిం దగు



మినుకులం బలికి తెల్లంబుగ నుల్లంబునం- గలవంతలం జెల్లగించి వింతలగు సంతసంబులం- బల్లవింపఁ జేయుము॥

ఆమో॥ ఓయమ్మా - నీవిక్కార్యం బింతవట్టు నాకుఁదెలుపవలెనా - నాకిది మూర్తంబై బహిర్భూతంబైన - ప్రాణాంశ సమష్టియేకాదా॥

దేవి॥ ఔనేయమ్మాళూ. ఈయరతంబు నీవలపోరచి యింతయదనునకింత। చదువు గఱపుటచేతనే తెల్లంబగుచున్నది, మనము వేరుగ నుడువనేమిటికే॥

ఆమో॥ ఓయమ్మా నీసంతసంబెగాదే - నాజీవితంబునకు రసాయనంబు - నీయానతియకాదా నాకీలు గంటునకు సూనకుతుకురాయి-మంచిది యిది యిట్లుండనిమ్ము పరిష్కృతంబైన.

క॥ సుమహిత తౌర్యత్రికచం। క్రమణధురీణాగ్ర గణ్యగణ నీయయ్యెన్। విమలమతియింక రసకా। వ్యములంజదువంగ వలయు నవహిత బుద్ధిన్॥ ౮౦॥

గీ॥ సరస కావ్యామృతా స్వాదసౌహృదమున। దీని జాడ్యము దొలఁగు నింతింత యగుచు। సకల హిమకర రుక్ఛటా సంగమమున। విరిసిపోవదె రేయిఁదిమిరభరంబు॥ ౮౧॥

సాకూతస్మితంబుగ॥ క॥ కావ్యరసానుభవంబున। దివ్యత్రపతిభై మనోజ దేవనసరతన్। నవ్య ప్రకృతియ యయ్యెడు। భవ్యగుణు న్వరుని దేగఁ బ్రయతింపు ముకన్॥ ౮౨॥

దేవి॥ సాశ్చర్య స్మిత వికాసబాలాతపాలంకృత వదనారవిందంబుగ - ఓసి నాపట్టీ -ముద్దుల పట్టీ - యీ పట్టికా యిట్టి యెుల్లింపు నట్టువుల పుట్టువులు - అట్టైన నిత్తట్టి కట్టిదో యొకనట్టు పుట్టునని నె గట్టిగ నుట్టంకణం బొనరించివక్కాణించెద.

నేపథ్యంబున ॥క॥ నల్లందనమున నిరులను। నుల్లంబునఁ దన్ను జెరుప నొగిమిన్నంటెన్। దెల్లంబుగఁ బ్రొద్దనుచుం। దల్లడపడి మ్రాకు మొదల దాగెడునీడల్॥ ౮౩॥

గీ॥ కర్మఠు లొనర్చు నిగమసత్కర్మ హోమ। దేవనిర్దిష్టధూప ప్రదీపధూమ। పటలముల జయఘంటికా పటురవముల। నెమ్మి నెమ్మిగ నాడెడు నీరదమతి॥ ౮౪॥

చ॥ సరణిపశంబునం దరణి సోమన సాయన మధ్యదేశముం। దొరకొని యుండఁ జాయగని తోఁట్లియశేష విశేష సక్తగాఁ। బరగిన దోఁటఁ దన్నినుడుఁ బాంసులగాఁ దలపోసియుగ్రుఁడై। పొరిగొనునంచు భీతయయి పొందుగ నొందెడి దీనభావముల్ ॥౨౫॥

మ॥ చిరసంప్రాప్తరతోత్సవానుభవ సంసిద్ధాధికాయాససం। పరణోదీర్ణ మృణాళ ఖండ కబళాస్వాదోన్మదాత్మంబులై। తరుణస్యందన పాదపక్షి యుగముల్లల్పంబులై యొప్పె నా। మరపత్రింబులఁ బన్వాళించెడిమిళన్మస్తాగ్ర నాళంబులై॥౨౬॥

చ॥ హరికరసంప్రబోధిత సరోరుహ వాటములందుసూటగం। గురుత్ప్రఫుల్లసిల్ల మతికుత్తిక బంటెగ నానితేనియ। ల్వారమడ సమ్మదంబులయి వారకతేటుల ఝూటువల్బర। స్వరమిళితంబులై శ్రుతిరసాయిత గీతములొలిఁ బాడెడున్ ॥౨౭॥

శా॥ వాతాఘాత దళద్ద శావళి సముద్వాంత ప్రసూనద్రవ। వ్రాతాశాంతనిషిక్త మంజుసురభీవ్యాప్త ద్రుమాలాంచిత। స్ఫీతానాతపదేశ తల్పములనాసీనుల్వయానుల్వని। ర్ఘాతాశాతర విద్యుతి ప్రహతులై దూరాధ్వగుల్న్ద్రితుల్ ॥౨౮॥

గీ॥ తామసాశేష విధ్వంస ధర్మసుహృద। మైననీదు ప్రతాప సమాధిగనగ। గగనమధ్యము సేరె వికర్తనుఁడు। మిగుల వెలుఁగొందు మిత్రలక్ష్మీప్రియతను ॥౨౯॥

మరియును సీ॥ సంపత్ప్రసవసద్మ సత్త్రితవంశాబ్ధిలబ్ధోదయబుధ సంద్రుబ్ధమహిమ। విమలగుణాత్మతుల్య మహితసోదరసంతాన సంతతోజ్జ్వల యశుండు। నిజగుణప్రసవౌఘ నిర్మితానుగ్రహామరకరంధ్ర పుష్పసన్మధుకరుండు। తామసాహంకార దారణపటు కలానాథాగ్రజన్మగుణాకరుండు। సహజవితరణ విషయ భూషాద్యశేష విషయితోష దసద్వస్తు విత్రపహ్రాప్త। విబుధరమణీమణీగణవిదిత పుత్రీభావకర్తృభోక్తృ సంభావితుండు ॥౩౦॥

కం॥ కావున ననుధర్మశ్రీ। భావుకతమ పారిజాత పదవాచ్యుండీ। భూవిభుఁ డాచంద్రార్కము। గావుత సకలేష్ట సిద్ధిఁ గాశ్యపి నెల్లన్ ॥౩౧॥

క॥ అనుచు శ్రద్ధావిధిభర। మునననన్యానోపచారముల విప్రవరుల్। బొనరఁగ నర్చితపరమే। శునిపైఁ జెట్టుదురు మంత్రశుభపుష్పములన్ ॥౩౨॥



వ॥ మఱియు నీపారిజాతక్షితిపురుహూతుండ కారణ శరణాగత జనతాభరణాభరణుండును వివిధాధి నిధానదుర్విధ దుర్విధశాంధ తామిస్ర విస్రంసనాజ స్రసమాశ్రితభుగ్రసస్వామి మహోగ్రసమహిముండును గావున నీమహారాజశేఖరుంగాంచి సేవించిన నాకసుఖంబులం బడయనగునని తలంచి నించిన కుతుకంబులం దత్తద్విద్యాన పద్యపద్యా చంక్రమణజంఘాల సంఖ్యావత్సంఘంబులు దూరాశావశులై దూరాగావశంబుల నేతెంచి స్వపాండితీనర్తన సమాహ్లాదిత భవదుపలబ్ధ తత్తత్ర్కషతాసంజనితహర్షా క్రాంత స్వాంతులై యెండియుఁ దమకడలకు వెడలు నెడల నతివినయ భక్తిశ్రద్ధాభరంబులఁ ద్వదుపనీతంబులగు పదార్థంబులం బాకంబులంగావింపించికొని సుస్థాస్నుచేతస్కులై యప్పరమేశ్వరు వివిధ తద్విధ విషయమంత్రంబుల నభిషేకించి సంపూర్ణోపచారరమణీయంబుగ నువికచస్యంద మానమరంద బిందు సందోహసుందరతరకుంద మహోత్పల నీలోత్పల విచికిలవకుళసేవంతికా ప్రముఖ సుముఖ సుగంధ బంధుర కుసుమ స్తోమంబుల సురుచిరతిపంచపత్ర భాసుర తులసీశైలూషాది దళ విశేషంబుల సహస్రనామార్చనంబు గావించి మిలమిల మెలగు శాల్యోదనంబును గంధగ్రహాపిహయ [illegible] విధ [illegible] వాసనా సంవాసిత గోఘృతమిశ్రసంపక్వ శర్కరాన్వయ పాయసంబును [illegible] లక్ష్యంబులగు నానావిధ భక్ష్యంబులును కర్కటికీ ఫలాదిసముత్పాద ప్రముఖ శలాటు మయంబులును మూలసూరణాది కందమయంబులునగు శాకంబులును బహువిధ లేహ్యంబులును సర్షపామ్రజంబీర తిక్తీయరస భావితార్ద్రకాద్యుపదంశంబులును సారస్వాధుప్రసాదిత పరిశుద్ధపయః పరిణామంబగుట సుందరీరదనాంబర పాటల ప్రభాస్వాదాడంబర పాటచ్చరకలంబులగు దధిశకలంబులును సుసంహితపానభాజన విన్యస్తంబగు హైయంగవీనంబు సురసనామృతంబులగు సహకార కదళీకంటకఫలాది ఫలంబులనుం గనుంగొని భవనీయ భక్తి విశేషంబున కరుణించుము గతిసంభ్రమంబున నాప్పాసాకషికి సమర్పించి నిర్వర్తిత తత్కాలోచితకృత్యులై యనుందానందకందళిత హృదయారవిందులై యభ్యాగతజనంబులతోడం బ్రతికబళంబునకు భగవంతుండగు నీశ్వరుని నామంబులు భవదీయేష్ట కామస్తోమసిద్ధి ఫలకాశీర్వచనంబులతోడ సంస్మరించుచు భుజియించుచున్నారు దేవా యవధరింపుము। ఇట్లనుచు ద్వితీయప్రహరావసాన సూచకంబుగ ఘంటామణిం బ్రహరించుచున్నారు। దేవి। ససంభ్రమంబుగ। ఓపట్టీ యార్యపుత్రుండు

విశ్రాంతికై శుద్ధాంతంబునకు రాఁదలఁచియున్నది నీటి కాదాన విజనాది కృత్యంబులనే సేవింపనేగవలయు దీని నీయుపాయంబులంగుశలినిఁగాఁ జేయుము ఇట్లు నియమ నాంగీకరణంబుల నందఱు సంతసిల్లుచు స్వోచితస్థానంబుల కరిగిరి.

ఇది ప్రథమాంకము. శ్రీరామాయనమః.

—— :o: ——

## ద్వితీయాంకము.

శుభమస్తు.

———

పదంపడి మంజరి యామోద రేఖయుఁ బ్రవేశించుచున్నారు.

ఆమో॥ ఓ భర్తృదారికా యవధరించితే యంబ యుది తంబులు.

మంజరి॥ అత్తికా నామినుకులు నిక్కంబులని లెక్కించుటకు మక్కువల నెలయించుచున్నవిగదా.

ఆమో॥ (స్వగ) ఇప్పటికయినం దీనికి మాతయంతరంగంబు సంగతంబుగాదయ్యె నయ్యో దీనిమాహాత్మ్యంబు (ప) అద్దియట్లుండనిమ్ము అమ్మా నీయమ్మలికకై నెమ్మనంబునం జింతించుచున్నదని యిమ్ముగ నమ్ముచున్నావా.

మంజ॥ అట్లు నేనెట్లు నమ్ముదునే యత్తికా నేనప్పుడప్పుడం తలింతలని వచింపరాని వింతవింతలగు వంతలనంతంబుల నొందుచానివలెఁ జెంతంగనుపించినను సంతసిల్లుదానింబోలె నుండును గాని యింతయేని గనికరంబుగలిగి నాపొంత మంతనంబుసేసెనే నానుడువులు హుళుక్కులని తలప వలనుగాకుండ నీయెదుట నే వచించితిగదా నీవు వచ్చుటంజేసి యేమితలంచెనో నాకింకనింకం బొంకంబుగం బరికింపుమని నను నీకొప్పగించెఁగాన నీవలన నీగోడుమీఁదందగు। అమ్మవలె నీవూరకుండవని నమ్మెదనే నెమ్మనమ్మున.

ఆమో॥ సదరహాససుందర వదనారవిందయయి కౌఁగలించికొని వాతెరలం జెక్కుల నొక్కి కురువునం గూర్చుండబెట్టుకొని ఓచెలియా యీమీద నీదిగులు నిము



సంబుల వెడలించెదనే నీకన్నది వలంతిగా యూరకుండెఁగాని నేనట్లు జేసెదనా బెగడు వీడుము వెసగన నీయుసురులకుం గసరు విసరించి పసిమ మసలు సంతసంబులనొసంగెద నాపలుకుల నాలింపుమని దానియెదకు బెడగుల జాడలనిడు నాజవ్వనంపునంగ మచ్చల పుట్టువుల కతంబులు న్వాని వినియోగంబులు నిట్టిట్టని వీనులవినుచు మున్నది

మం॥ కొత్తగంధపుం గొత్తిగబ్బిత్తనంబున నుబ్బు మబ్బుంబోలి యబ్బురంబుగ నిబ్బితి నిబ్బరంబగుచుఁ దన యొసయును తమ్మిన ననుగప్పి మొగడ పోడిమింజేయఁదా వెలవెలబారు మొగంబునం దలవాంచియుంచున్నది.

అమో॥ ఓచెలియా యెందుకే నాననానెదవు నేలచూచుచుంటివేమే ఎందుకే ననుంగానవు నేనిట్లంటినని నామీద నలుకయుంగలిగెనే యనుచున్నది.

మంజ॥ (స్వగతంబుగ) దీనికేమని మారు మినుకు మినుకుదును ఊరకున్ననిది యుల్లసంబులాడు తెలివిలేమి నికదా తల్లియుల్లంబుగానలేకపోతిని గాన నిపుడేమి సేయవలయునోయని సందియంబునం గుందుచు సభయ వ్రీడంబుగం గన్గొనుచున్నది.

ఆమో॥ చెలియా బెదరు వదలి మాటాడవేని నాయాన.

మంజ॥ గీ॥ అన్ని తెఱగుల లగ్గుల నమరగోరు। నవ్వయుల్లంబు దెలియక నవయు నేను। హొన్ను నానిడగుత్తుక నొప్పఁ బట్టు। దాని నురివేయు దానినిఁ దలఁపనొక్కొ ॥ ౧ ॥

ఉ॥ కన్నది సేయుమన్ననల గారవముల్పరికింపలేక నే। జిన్నతనంబున న్వెతలు సేయునవంచును నా మెమూరునా। కన్నను సన్నమా తెలివి గల్గినదేకద యెద్దియద్దితా। వెన్నకొసంగ నున్నమిడి వేవెత సేయదలంచితీవమక్ ॥

క॥ తానువినగ నీతోడను। నేనిటులంటిని నటంచు నేరము నాపైఁ బూనిచికవలి మనంబున। జానుగ నన్నేమి సేయు చాడ్పుదలచునో॥ ౩॥

క॥ అమ్మమనంబెట్లుండునో। యమ్మక చెల్లిపుడు నీవయమరు వెరవుచే। నుమ్మగిలకుండ నెమ్మది। నమ్మలి కలవమ్మునేయ నొగిబూనదగున్ ॥౪॥

ఆమో॥ (స్వగతంబుగ) ఈబాల నావలన నీవడుమం బొడమిన నడియాలంబు

లయందుఁ గింకఁ జక్కణంబులను శాశంక వెడలించి పరువంపు గురుతులని యెఱిగి యావంత వీడియుంగన్నది దిన్నని మన్ననలకు విన్నపాట మరనరమరలంజేసి యేమిదం డనంబు నేయునోయని బెగడుగొనుచున్నది గాన నిమ్ములగు నమ్మికల దీనినెమ్మనంబున కు సంతసంబు వెలయింప వలయు.

ప్ర క॥ జడుపేలనీకునోచెలి। జడతంగద పలికితిట్లు జననియుమదినీ। వెడగు తనంబెఱేఁగికదా। వెడలునోయిది యెప్పడనుచు వేసరుచుండున్ ॥ ౫ ॥

క॥ మనయమ్మ మిగులశీల । మ్మునవలరినయదియ కాన మోమోడివడిన్। మన ముడుకొన్నమాటలఁ। దనమోమునఁ జెప్పవలసి తావెతఁజెందెన్ ॥ ౬ ॥

ఆ॥ జనులకెల్లనిద్ది సాజమైకన్పట్టు। తనయులెపుడు పెద్దతనమునొంది। ప్రియ జనంబుగలిసి ప్రేమలుప్పొంగంగ। హాళులొందుదురని యఱయుచుంట ॥ ౭ ॥

ఆ॥ జనకులకు నపత్యజాతంబులుండిన । మిగులఁ దండ్రిగొడుకు మేలకోరు । న మ్మయైనదాని కఱువదిమణుఁగులె। క్కుడుగఁదములఁ జేయుఁగూతులగ్గు ॥ ౮ ॥

చ॥ అదియటులుండ లోకమున నందఱకుం దమ యాత్మ జన్ములం। దదనముగం జెలంగు కడునర్మిలియంతయు నొక్కటైననా। యదిమన యమ్మనీయెడల నందినప్రే మకు నుద్దిగాఁగనో । పదులఘుతూల లేశములు భర్మముతో సరియౌనె పెక్కు లున్ ॥ ౯ ॥

ఉ॥ ప్రాణులకెల్ల లోకములఁబ్రాణములైదని కింవదంతియా । ప్రాణములుం డ సత్త్వములపారత మించెడికార్యపాళివి । న్నాణముమీఱఁ జేయుదురు నవ్యగుణస్తు తమాతనీవను। ప్రాణము లగ్గునుండగ నరాజిలునర్మిలి యెంతొ చూడుమా॥ ౧౦ ॥

గీ॥ అట్టిహృదయాళువగుట నీయవ్వయెఱుక। వీడినీ వొనరించిన వెట్టితనము దలచిదండించు ననుకొంటదమ్మి పగతు। ఱాడగంటికిఁ గాకనియాడుటగద ॥ ౧౧॥

గీ॥ చిరుతమెయిపుట్టువులు ప్రేమకిరవులగుట।మాత్ర పితలకు మిగుల నమాయ వృత్తి। వారివక్కల సరసరవారియన్న। సంతసంబుల సలొందు సరసగతిని॥ ౧౨



క॥ బాలురనుడువులు వక్రిత । పాలుపడియుఁ బ్రేమసేయువారికి మిగులం జాలగ ముదంబులొసగుచు। బాలేందుని మూర్తిపోలెఁ బాటింపఁబడున్ ॥౧౩ ॥

గీ॥ నీవికను వీడు బెగడును నిన్నుదల్లి। గారవించునుఁగాని వికారమొంద। ద ర్భకోక్తులు పితలకు హర్షదముల। యగును నెటులైనఁగుసు మప్రహారగతుల॥ ౧౪॥

మం॥ గీ॥ అక్కరోయిపుడిటు లీవుమక్కువమర। వక్కణలు సేయనామది వంతదొలగె। నిక్కముగ నేను బ్రతికెగ సొక్కుటుడిగి। వెక్కురుల నక్కలకిడెద న క్కజముగ ॥ ౧౫ ॥

గీ॥ ఇంతమాత్రపుమాట నాకింపులలరఁ। దల్లిదొల్లియ నుడివినఁ దల్లడిలక। వెర పెఱుంగక హాళిచే వెరవరినయి। యుండుదునుగద చెలియరో పందువమర ॥౧౬॥

ఆ॥ తెలివిలేమి యనెడు తీండ్రంపు కింకకుఁ। దల్లియాలు వమరెఁడనరుతోడు। పాటుగాన నట్టిపాటులొందిన నాకుఁ। బ్రతుకు మందువైతి వెతలుదొలఁగ॥ ౧౭ ॥

ఆ॥ ఆడుబడుచు లందునర్మిలి యెప్పుడు। నదనమగుచునుండు నమ్మకనుచుఁ ప్రజలు సెప్పఁకొందుర్ నిజము గాదదియెన్నఁ। జెలియ కని వచింపఁ జెలువమమ రు ॥ ౧౮॥

ఉ॥ కావున నీవు నాకు హితకారిణివౌట సవిత్రికంటెనా। ప్రోవుటయందు నెక్కుడుగఁబూనితి ప్రేమను సేమమయ్యెనా। కీవుగదా హితాహిత సమీహిత బోధనిబద్ధ భావత। న్భావుకధాత్రి విశ్లెపుడుఁ బాయక కావుము చాలవేడెదన్ ॥౧౯॥
అని ప్రార్థింపుచుఁ దానిచరణంబుల నెరగుచున్నది.

ఆమో॥ దానిం బైకెత్తి ముద్దిడి కురువుననుంచి.

గీ॥ ఈవిటుల నన్ను బతిమాల నేల చెలియ। క్రొత్తదానవె నీకు నేఁగొమ రుమీరు। నీదుకోరికలన్నియు సేమమమర।వారకయ నెరవేర్చుట వరవునాకు ॥౨౦॥

క॥ ఇట్టులగుట నీకిప్పుడుఁ। గట్టిగ నేనొకటిజెప్పఁ గడగెదనీవుం। బట్టుగ నాపట్టుననిక। నట్టువడక చేసెదేని ననచుముదంబుల్ ॥౨౧॥

ఆ॥ నావచించుమాట నయమొప్ప జేసితి। వేని నాదుజన్మ మీడితమగు। నవిత లంతుగాన నలరు నుల్లముతోడ। నట్లుజేసి ముదము లమరగూర్పు॥౨౨॥

క॥ పనివూనియిట్లొనర్పగ। నినువేడెద నిజమునుమ్ము నిత్యప్రేమం। బునఁ గాన నాదుకోరిక।మనుపుము మహితాత్మవగుము మాన్యులలోనన్ ॥౨౩॥

ఆ॥ చెలిమియెంతయున్న చెలినీవు భర్తృదారికవుగాన నిట్టిరీతినిన్ను। వేడవల సెనిపుడు వేడుక లలరంగ। నాదుతమ్ముల నింపునర్మమర ॥౨౪॥

అమ్మా॥ అక్కరో నీవిట్లు చెప్పెదవేమే.

ఆ॥ నీవ తల్లివంటినీవ నా మేనికి।జీవితంబవంటిజీవనాధ। ధంబవంటి విట్లుదయ నీయయగునన్ను। గూర్చియటుల నుడువ గుటవుతనమె ॥౨౫॥

చ॥ మతిమతియిట్టునీవు బలిమాలుట నుల్లమునందలంపవం।చితమతిచేత నా. యునెడు శేముషిగల్గును గానయద్దియున్। హితమని యెన్న గాదగదు హీనమతిన్నను గేలిసేయగా। గతకపుకాయ యంతయిన కార్యముగన్పడ కున్కినెట్టులన్ ॥౨౬॥

గీ॥ కనలినీవిట్టు చెప్పవుగాని చెప్పె। దేనిసాపడుటుడిగెద నెట్టిరణములను నీ డెపవేడెద ముదముతోడ। మేనినైనను మేలనిమిగులనలరు ॥౨౭॥

అమ్మా॥ సస్నేహహాసంబుగ దానిం గవుంగలించుకొని తనయూరుపీఠింజేర్చి వాతెరచివురుచేతం దానిగండంబులు నిబిడంబుగం బీడించి ఓసి నారతనాలకుండా యటుచేసెదవే నీవన్నమాటతప్ప కూడదుసుమీ అట్లయిన నాయభిమతంబు వివరింతు సావధానంబుగ విని యట్లొనరింప నుద్యోగింపుమా.

సీ॥ జాడ్యతమశ్ఛన్న సకల పదార్థౌఘ సంప్రకాశనవిధి సవితృదీప్తి। యాధి నిదాఘ మహాతపాభిమ్లాన కైరవ వనసుధాకర కరాప్తి।సలలితశర్మ బీజప్రరోహణాద్భూతి హృదయ ధరిత్రికంబుద విభూతి। ప్రమదవరాలంబ ప్రతిభావిలాసినీ విహరణాసేచనక హరివనిక। మహితభూరి విధచమత్కార భాసురాలంకార భాసురరసమయైన। కవితనఘాలలితాంగ వృత్తిరీతి గుణౌఘసౌభాగ్య విజ్ఞానజన్యహర్ష। పీయూషలబ్ధిఁ బవిత్ర



దేవాత్మత ధ్వన్యర్థ విజ్ఞానధన్యతావి। భూతి సేవధిలక్ష్మి బోధైకధనికధీ కౌముదీస్ఫుర ణ రాకాధిహేల। సకల చింతాతంతు సంతానకర్తన కర్తరీప్రౌఢవికారలక్ష్మి। విగళిత నిశ్శేష వేద్యాంతరత్వలక్షణ మహానందరసప్రసేవ। శారీరకాగమ జ్ఞానలక్ష్మీలబ్ధి శ్రోతృశబ్ద గ్రహసుఖదవచన। కల్లోలమాలికాఘటన ఘనాంభోధి మార్దవపారుష్య మహితవర్ణ।వాచ్యగర్భధనమూలపాక భాసురవృత్తిరీతి మయకృతి సంప్రీతిమూతి। శ్లాఘ్య కావ్యక్షీర సాగరాంతర్లీన సారస్యపీయూష సంగ్రహవిధి। మంథానభూధర మహిత విభ్రమరమ శ్రోత్రపపాపేయ సుఖితపుణ్య। జనసంవిద జరతా జననసుధారస ప్రసవ మంథన భంగరహితశరధి। గీ॥ గానసాహిత్య విద్యయు గానసహిత। మగుచు సరసజనాళి యాహ్లాదభరవి। ధానసువిధాన విభ్రమాధానియగుచు। సకల విద్యామతల్లియై శ్లాఘ్యమగును ॥౨౮॥

గీ॥ ఇట్టిసాహిత్యవిద్య నీవిపుడు వేడు కడరఁ జదివిన నీనేర్చినట్టిగాన। కలకు విమలమణికనక పరిసాధనమునకామోదసంపద నటనగాదె ॥౨౯॥

క॥ నీవీచదువు జదివిన। నావేడుకలెల్ల మిగుల నయమహిమముచేఁ।జేవనలరు సిరులకరణి। నీవులవలె వినయకలన నితశోభముతై ॥30॥

క॥ ఈపనినీకు విధింపఁగ। నాపోవనియిచ్చవుట్టె నాత్మనునాకుం। దాపురమేల వచించితిఁ। గోపముసేయక యచేయు గోర్కులు మిగులన్ ॥31॥

ఆ॥ చెలిమియెంతయున్న।చెలినీవు భర్తృదారికవుగాననిట్టి రీతినిన్ను। వేడవల సెనిపుడు వేడుకలలరగ।నాదుతమ్ములనింపు నర్మమమర ॥ 32॥

క॥ పలుకులు ములుకులువోలుత। గలకండల పలుకులొండెగారావుసిరి। స్వేల యింపునాదుకోరిక। నలరింపుమునీదు ప్రీతిననయము చెలిరో ॥ 33॥

ఆ॥ ఇట్లుచేసితేని యింతకులోఁగడ।నీకుఁ గఱపినట్టి నిపుణవంద్య। మైనగానకలకు నర్హదక్షిణనొందు।నటులసంతసిలుదు నట్లొనర్పు ॥34॥

మం॥ తద్వయస్యా వచనరచన సమాకర్ణనజనిత చిత్రతంజితో లిఖిత పుత్రికాకారహాత్రంబగు చుంగదు దడవుదాని వదనవిశదాంశు మండలంబున నిశ్చలనిర్ని

మేషంబుగ లోచన మేచకాంబు జంబులం గీల్కొల్పి యొట్టకేలకు.

క॥ ఇదియెట్టివేడుకే చెలి। సదయతననుఁదెలివియీనిసమధికవిద్యా । స్పదమొ నరఁజేయబూనితి । గదయిది యమనంబునకును గదరీతియగుఁ ॥ ౩౫॥

గీ॥ ఇట్లువేడుటకాఁబోలుహితము సేయు । వారికుపకార్యులయెడవర్తనంబు। ఘనుడు జీవనమిడువేళ గర్జితంబు। పలుప బనియేమిగాదేని సమయమట్లు ॥ ౩౬॥

గీ॥ బెగడులిడుచును గొట్టుచుబిడ్డలకును । బెద్దలగు వారుబుద్ధుల జేర్పిమనిచు దు । రహహానీవైన దెల్పుచు స్వార్థపరత। హితవిబోధముచేయుదు వెపుడుచెలియ ॥౩౭॥

గీ॥ గులకతాల్లతనంబున గోరువాని । కసురగురుదైవ తమణీ మహానిధాన । మ బ్బుటయకాదెయతి నీచహాస్యమతిని । యైననాకిటు దయసేయుదనుట దలఁప ॥౩౮॥

ఆ॥ గురులు శిష్యజనుల గోరంతయైనను। బ్రేమ వెలికినిడక బ్రీతియున్న। మూ సికలలనెల్ల వాసికెక్కెడుదాక। గఱపవలయు గర్వమెఱుగకుండ ॥ ౩౯॥

క॥ బెగడడకువ బత్తియునోలు । కగవేడినగాని కలలగఱప రువిబుధు। ల్జగతిని నీవైనమవిరి । విగనర్మిలి నేసిగఱపవేడుదువహహా ॥౪౦॥

క॥ పెక్కులు వక్కణ సేసిన। గక్కసమది నీదుమదికిగావించునొకో । యక్క రొనిక్కము వినిచెద।మక్కువ మరజెప్ప నే రమనుపుము కృపచేన్ ॥౪౧॥

చ॥ తొలుతన తెల్విలేమి కడునూషిత మానసనైతి నిద్దియే । దెలుపగనేల వే రుగను దెల్లమునీకయియుండు నింతయుం । దలివనినిన్ను నమ్మెదను దప్పకనింతయకా ని యొండు నే । దలఁపగజాణగాను గృపదాల్పుముగావుమువేడెదంగడున్ ॥౪౨॥

ఆమోద॥ చ॥ చెలియరో యెంత వింతమది జేసితివేయిది గాక నీకునే । గలు మల హాయులోలి జవిగాంచెడి దానికి నింతకంటెనే।బలువునిడందలంచెదనె పల్లవకో మల గాత్రదీనికే। కళ వశమందు చుండియును గార్యవశంబునఁజెప్పవచ్చెనే ॥౪౩॥

చ॥ గురువులశిక్షనొందక నిగూఢజడత్వము నన్వసించువా।రురుగుణులైన దా ... జేయనింతయున్ । వెరవరులౌటకుం దగరు వెగ్గలమూ బెరడుం



డ హీరముఁ। సురుచితనొస్పు నొక్కొ నికషోపలకాషవిశేష రోపతఁ ॥ ౪౪॥

ఉ॥ కావున గర్షముల్మిగుల గర్కశలోహ వికారవల్లివే। ధావితతవ్యథాభరము దాల్చి మణీమయ హేమకర్ణికా । భావిత తిన్వెలుంగ క్రియ బాత్రమునందగుబాధకోర్చి స॥భావిత పాండితీమ హితమండన సంపదనుల్ల సిల్లుమా ॥ ౪౫ ॥

మరియును బాండితీ మహిమ వాకుర్చెద నాలింపుము.

సీ॥ గాఢవిమూఢ తాఘన తరతిమిరౌఘ విఘటన శారద విధువిభూతి । వైదే య తాగ్రహావగ్రహా గ్లాన చిత్తోర్వీమ తస్య పీయూష వర్ష । మధిక యథాజాత తా తపక్లేశ సంహరణ గీర్వాణాపగాంబుసేవ । యనభిజ్ఞతా హితాధ్యపయశఃపంకనిశ్శో షణ భీషణ పౌషణఘృణి । యవిదిత హృదయనర్మాంకు రావిర్భావనవ వారివాహావి భవభరంబు । సన్మాన సావాససంశ్లాఘ్యశుచియశస్సార సౌఘవిలాస సారసవని । రసిక భావుక భావరాజమ ణిస్థలీహార్దర సోద్గార హరిమరీచి । నిజనర్తనకలా వినిద్రీకృత స్వాంతశాంత వేద్యాంతరసభ్యసమితి । స్వరసానుభవచుంచుసమాశ్రిన్నోరత్న సాత్కార జోత్కట స్వవిభవంబు । సకలేప్సి తార్థనిష్పాదన దుశ్చరతరత పశ్చర్యాప్త ధాత్రు వరము । పరహృదయ చ్ఛందపరిభావనానల్ప శిల్పకల్పన కలా కల్పవల్లి। సుఖదుఃఖ సం ధా తృశుభతది తరకర్మ విధినిషేధవి బోధవిమలదీప॥ గీ॥ మవిరత విహితవిని యోగ హర్షితార్థి।జనకదంబకమైయును శశ్వదుదిత। మహిత పృథ్యను రుద్ధతాసుహితమగుటఁ బాండితియ జనులకుఁ గల్పపాదపంబు ॥౪౬॥

గీ॥ మిగుల వీఁసిల్లు సొబగులుప్రియుని బ్రేమ।వాని నెద్దియు వెలఁగునవార్యభంగి। వానిఁగడునడరు యువతి పాండితికల । నివ్వియును దానఁదద్దయు నెలమినలరు ॥౪౭॥

క॥ గుణములనెల్లనుజాలిన। గణనీయంబైన విద్యగానకయున్నం । బణితుఁడు గాఁజననోపఁడు। మణిశాణ విఘృష్టివీడి మహితంబగునే ॥ ౪౮॥

**క॥ ధీరులుభావిఫలేచ్ఛా।ధారులగుటఁదాదికోగ్రతరఖేదముల। న్భారములదాల్తు రుచిర। స్ఫారయశశ్శ్రీసుఖములఁబచరించుటకై ॥౪౯॥**

**కావున.**

గీ॥ నారికేళ తరువునాటి పావని చే। ఫలము నిచ్చుదనుకఁ బ్రబలమయిన। బడలి కోర్చి సుచిర బహువిధ సుఖముల। నొందునట్లు నీవు నొందుజదివి ॥ ౪౦॥

మంజరి॥ స వినయామోదంబుగా.

క॥ తెలియలతి తెలివిగలుగుటఁ। గలనైననునిట్టు కలలఁ గఱపఁగదలపం। గలనా యటులైననుచే। టలగరుల దివంబు వోవుటకుఁ దలపనోకో ॥౪౧॥

ఇట్లు గాకున్నను.

గీ॥ అల్పులైనను జగతి మహానుభావ। భజనమున దారవర్ణతాపాతులయ్యు। నలసువర్ణ తఁగాంతురయస్సు రసవి। శేషసంగతి రసమాట సిద్ధమెకద ॥౪౨॥

అక్కతంబున.

గీ॥ జడతచే నిపుడేన్గడు సడలియున్న। నీదుకృప నీమహార్థంబు నిర్వహింతు। నతిజడంబైనఁ దేజనా యతశలాక। వలెనధర్వవిధీరణ బలిమికలిమి ॥౪౩॥

క॥ ఇదియెటులఁ జదువవలయునో। యదిమదికిం దేటపరుపు మర్మిలి వెలయ। న్నదిమంచి దానివరసెదఁ జదివెద। నీకనికరంబు జక్కనిదసుటన్ ॥౪౪॥

ఆమోద॥ సాదరానందంబుగ.

క॥ నీచేఁగాదంబి నివలె। నాచిత్తచనరచనల నునభినవతావ్యా। కోచితధారలఁ బోలెన్। నాచేత మునుల్లసిల్లు నవసస్యగతిన్ ॥ ౪౫॥

క॥ చెలినీవిట్టు లనుటచేఁ దెలిసెను నీయుల్లమెల్లఁ దెల్లముగానా। పలుకులు నీరొదఁ గడలి। న్వలెఁగలసి తిరంబులగు తవరదలువోలెన్ ॥ ౪౬॥

ఇప్పుడు వివక్షితంబగు దివిషద్భాషాధ్యయన ప్రకారంబెఱింగించెద సావధానంబుగ నవధరింపుము.

సీ॥ తొలుత నర్థంబులతోడ శబ్దంబులఁ జదువంగవలయును శక్తికొలది। నవి మనంబున నెపుడమరియుండుటకయి చింతనల్మఱి నఁజేసేయవలయుఁ। బదపడి పావని కంబద పదార్థంబుల సంబంధములఁజాలఁ జక్కగాను। విపుల విభక్త్యర్థ విజ్ఞానమమరంగఁ జదువుచుఁ దాత్పర్య సరణి గనుచుఁ। గ్రమభవ సమాస కుసుమ సంగ్రథన విధిని దనరి యభినవ శబ్దార్థ తతులనట్లు। పాసగునటుల వితర్కించి పొలుపుమీఱఁ। జదివిన ను బాండితియమరి చక్కబడును॥ ౪౭॥



క॥ చదివిన పదములు మగుడం। జదివెడు నెడఁజేరవాని సంగతిలోఁబై। బదముల యరతము లరయుచు। ముదమొదవఁగఁ జదువవలయు ముచ్చట లమరన్॥ ౪౮॥

ఇట్లధ్యయన ప్రకార నిరూపణం బొనరించి పదంపడి దైవజ్ఞ దత్త శుభ ముహూర్తంబునఁ గావ్యాధ్యయన ప్రారంభంబు విధి విధానంబుగ మహోత్సవంబు లుల్లసిల్లం జేయించి యంచిత క్రమంబునం జదివించుచు నొక్కనాడాత్మ గతంబున॥

క॥ నాయాదోచ్చారణముల। నాయాసత దీని మంజులాత్మఁ దగిలివా। లాయము విడువఁగ నోపవు। నాయమయి దెవరుపరశరణము వదలెదరో॥ ౪౯॥

గీ॥ అహహ నాయుపదేశములన్ని। దీని నాత్మనంటి తొలంగక హాయినమరు। కుందనపురవణమ్మున గూర్చినట్టి। మణికణికల తెఱంగునమహిమ మీఱు॥ ౫౦॥

గీ॥ అతి సరసమైన దీని చేతోంబుజంబు। బుధజనులు సల్పు ఘనతర బోధములను। ప్రాయమసృణ శిలామల ఫలకమగుచు। నొప్పుచున్నదివిప్పుయియొప్పులమర॥౫౧॥

ఆహా దీని మనీషావిశేషంబు॥

సీ॥ గూఢదురూహార్థ కోటిసాత్కృతికయి విమల మతింజేయు విగ్రహార్థ। పదవిభేదనవేళఁ బరగు ద్వైవిధీభావకలయై పదార్థసంఘటన తతిని। సంధికలాలక్ష్మి సహజయై యర్థ తాత్పర్య శోభాగతిఁ బరమయాన। రూపమై సిద్ధాంత రోహణాసనయి కలిత చమత్కార కలనకలుము। లకు సమాశ్రయముగుచును లలితరీతి। వినుతమగు దీని మతి యతి తనుతరాత్మ। యతి నిసితశస్త్రిఁబోలి పదార్థభిదల। మూర్తియగు నీతికై వడి ముదమొనర్చు॥ ౫౨॥

ప్రచురాధ్యాహార క్రమ। రుచిరంబగు దీని యాత్మరోహద్వీచి। ప్రచుర ఝురంబు నహిమకర। రుచిపోలిక నామబోధ రోచిష్ణువగున్॥ ౫౩॥

చ॥ దురధిగమార్థ బోధ విధిదుష్పథ చంక్రమణోరు ఖేదులౌ గురువులకార్తి వ్రా నడచి గోములహాయిఁ జెలంగఁ జేయఁగా। నరయఁద దీరి తార్థవిభవానుభవంబున్నఁబొల్చు సమ్మద।స్ఫురణ మనోజ్ఞ శిష్యముఖశోచిర భాశయమే సమర్థమా॥ ౧౪॥

శా॥ స్వోపన్యస్తములై తనర్చెడు మహాసూక్త్యర్థ భావంబులం। దీపంబై వెలుగొందు శాతమతిచేఁ దెల్లంబుగాఁ బ్రేమతో। నేపారంగని వీడి మల్లట మహా హింబోలి నిశ్శంకుడై। యాపాలావయి వాగ్రసంబిడు జనుం డబ్బున్మహాభాగికిన్॥ ౧౫॥

క॥ అనుచు వచించు సుధీశ్వరు। లను దచ్ఛందజ్ఞనాట రాజిత మతినై। కాని యాడెద నాకిపుడిది। యనుగుణయగు శిష్యయయి మహాస్పదమగుటన్॥ ౧౬॥

చ॥ విడువక కొంతకాలము వివేకినినై యలపోర్చి నేర్చినం। గడువడిగాన నీబుడత కావ్యములందగు మర్మజాతము। ల్విడివిడి తేటగాఁ దెలియఁబ్రోడగు నీడగువారికెల్లడం। బెడగడరంగ జేయు మతివెగ్గల మానుడి యాలమందినన్॥ ౧౭॥

క॥ సుమతియగు దీనిమనమున। నమరపఁబడు నాదువిద్యయతిమహిత మహీ। సమవహితక్ష్మాప్త వల్లి। సమమయి సుచిరంబురుఫల శాలిని గాదో॥ ౧౮॥

ఉ॥ కొంచెపు తెల్వి గల్గుటయుఁ గొంకక తామ వివేకులంచుదు। స్సంచిత గర్వులై యొఱుగఁజాల కలాతుల తెల్వికల్మల। న్వంచనసేయఁ గోరుదు రవారితులైయిదిరైయినఁ దెల్విచే। నంచితవేద్యజాతవిహితాదరయై వినయంబునూనెడున్॥ ౧౯॥

క॥ కర్షకుడును విద్యార్థియు। హర్షము చేఁదగినతతిని నలపుల నెల్ల। న్మర్షించి పాటుసేసిన। దర్శంబుల ఫలములంది తగమనుదు రిలన్॥ ౨౦॥

సీ॥ ఈ డేరతతి దీనికెపుడేగు దెంచెడుఁ బరువంపు చిన్నెలు బయలు వడెడు। చదువుల మర్మమాల్గాల వశములగుఁ డీకుపాటులగు నుట్టీకితములుఁ। గైసేత మెఱు నాసలమరియుండు రసపు కబ్బముల సరసతమించు। చిట్టల రూపుల సేవింపమది రొచ్చువన విహారాదుల వలపు మెలగు। సరళతనుమించు సకులవచనరచనలు। కుడుగకయు చేయు వక్రతనూహ బలిమి। సలలితవ్యంగ్య కలితార్థ సరణిమీఱు। భాషణప్రౌఢి మయుఁ దీరి పరిఢవిల్లు॥ ౨౧॥



మతియు నిది.

సీ॥ సాటిబోటుల మీఱు సౌరుతీరులఁగాంచి మురిపెంబు లలరగ మోవివిరుచు। నాలేఖ్య లిఖితాఖిలావనీ వరవరాకారము ల్బరికించి నీరసించు। స్వప్రతీకప్రకాశావబోధచ్ఛల గ్రథితోపమాన వర్గ ప్రశస్తి। వ్యాఖ్యాతములగు నర్థాశయాంతరకల్పనలజేయు నితహేతు లలిత భణితి। చెలులు దనచెంతఁ దమలోనఁజెలిమిమీఱ। మరుని కలనుల సుద్దుల మాటలాడఁ॥ మోమునతమైన సిబ్బితి ముద్దులొలుక। వీనులిడు నిభృతాక్షియై వానిదెసల॥ ౨౨॥

గీ॥ ఆత్మనంబుధివలె యౌవనాభ్యుదయము। పర్వదినశర్వరీశునిపగిదిఁ దోఁప। విభ్రమార్భటు లురుభంగ విధలఁ బొడముఁగాని వానిని వారించు కతముగలదె॥ ౨౩॥

చ॥ మరునకు గెల్పులచ్చినిడు మాయల మందుల పెట్టె విభ్రమోత్కర కమలాకరి స్ఫురణగాఢ శరద్రమ భోగతృడ్ఝరీ। సరణ ఘనాఘనోదయము సన్మద బర్హిణ తాండవక్రియా। కరణ నవాబ్దమాను గద కాంతము యౌవనమెల్ల వారికిన్॥ ౨౪॥

క॥ ఇది యిప్పుడంతి పురమున। ముదమున నుండంగ వలయుముక్తవశయరైై। యది గావున వేగమయిది। సదువనలంకార కలల సమయంబయ్యెన్॥ ౨౫॥

ఉ॥ మంకుతనంబు వీడి గరిమంబుననొప్పెడు నోర్పుచొప్పునా। శంకతనొజ్జలం గనుచు శశ్వదధీతములైన పాఠము।ల్గొంకక చింతనల్సలిపి కూసమువీడిన తావిచువోలెదు। శ్శంకలు సేయువారియతిసాహస మార్పవవేకలల్లదా॥ ౨౬॥

చ॥ సకియిక గొంతవట్టదుపు సగ్గుట నొందకనుండఁబోలు వెం।డికడిమి వ్రానికొన్ని యగు టీకలఁ గూడిన నాటకంబుల।న్వికలతలేక నేర్చినప్రవీణ కలావతియై తనర్చునిం। చుకతతియేని దీనిమతి చోద్యముగాఁ జదివింప మేలగున్॥ ౨౭॥

చ॥ చదివిన కావ్యసర్గములచాలున మీదనలంక్రియా కల।ల్జదువగఁ బోలు తెల్వియును జాలినదై కనుపట్టుగాన స।మ్మద మతురంగ నిప్పుడు సుమాళముగాఁ జదివింప నొప్పున। ప్పిదపని జేచ్చనుండఁ దగుఁ శేశల లీలలరాణివాసమున్॥ ౨౮॥

గీ॥ చదువు జెప్పెడి వేళలఁ జతురమతులు। శిష్యులెంత హావణికలఁ జేయు

చున్న। గట్టియను యోగములఁగట్టి నట్టునడిన। నీసడింతురు తదధికాభ్యాసము కయి॥ ౭౯॥

గీ॥ అట్లు కాకున్న వారల యంతరంబు। గరువమునఁ బొంగితమ చేయు కార్యములన। లసత నొందదె యటులైన లభ్యకార్య। ఫలములు గిడిసపడుఁగాక భవ్యమగునే ॥౮౦॥

గీ॥ లాలనంబున బహుదోషలాభమనియుఁ। దాడనంబున బహుగుణ తతియవాప్తి। యని పచింతురు విబుధు లట్లౌట సుతుల। సేసరుల నియమింప విశేష మంద్రు॥ ౮౧॥

శా॥ అంతేవాసులనుండు ప్రేమలని గూఢార్థావ బోధక్రియా। సంతానంబుల వెల్వరింపవలయుం జాతుర్యముల్దోఁపవా। సంతాభ్యాగమ రీతి ధీవ్రతతికిఁ సౌరభ్య భాస్వత్కలా। సంతాన ప్రసవంబు లీనునది యీపత్త్రివ్రత న్వారికిఁ ॥ ౮౨॥

సప్రకాశంబుగ॥

ఓచెలి నీవికఁ గావ్యపాఠంబు నిలిపి ప్రత్యహంబును బూర్వాహ్ణా పరాహ్ణాంబులయం దలంకార రూపక పాఠంబుల విశేష శ్రద్ధా సహనంబు లొప్పఁ జదువందగు.

మంజ. ఓయక్కా నీయానతి నాశిరంబునకు విచికిల కుసుమ సమాకలిత మహిత మాల్యంబుగదా.

ఆమో. ఈకృతులభినవ సంకేత నికేతనంబులు గాన ననన్యవృత్తిత నభ్యసింపందగు.

మంజ. ఈజనంబు త్వదాజ్ఞావశంబే। అని యుభయులు నత్యుత్సాహంబున సమర్యాదంబుగ స్వకార్యంబుల నిర్వహించుచున్నారు.

ఇట్లుండ నొక్కవాసరంబున - ఆమో.। ప్రకాశంబుగ . ఓభర్తృదారికా.

మంజ. స్వగతంబుగ - ఈమె యెల్లతఱుల నన్నుం జెలి శబ్దంబున సంబోధించు నిప్పుడేమొకాని గౌరవాభిధానంబున నాహ్వానంబు సలుపుచున్నది - పరికింపనిది సకారణంబయయి యుండుఁ గావున నియ్యెడ శిష్యాచారంబవలంబించి సవినయ భయభరంబుగ సంభాషింపందగు - ప్రకాశంబుగ - భగవతి యీజంతువు శ్రీమదను శాసన మహావ్రత విధానంబున నాత్మను గృతార్థంబు సేయం బ్రతీక్షించుచున్నది కావున ననుగ్రహింపందగు.



ఆమో. దరస్మేరవ్యంజకనిభృతవదనంబుగ। ఓసీ నీసంభాషణ వైఖరి వైలక్షణ్యంబునం గానంబడు.

మంజ. స్వగతంబుగ ఆహా దీనికిం బ్రతివచనం బేమని వచింతు- స్నేహ గౌరవ మర్యాదలు పరస్పర విరుద్ధంబులగుట నియ్యెడ నెద్దియు సావకాశంబై చూపట్టదు- "పశ్చాద్దర్శః పురతోంధు" వనునయంబభినయ విషయంబై ప్రాప్తంబయ్యె ననియవనత వదనయై యూరకుంచున్నది.

ఆమో. స్వ। ఇయ్యెడనిదియె యుత్తరంబుఁ జెప్పంజొప్పుగానక విప్పగనొప్పు సంకోచంబున నవ్యాకోచ స్వాంతయగుచున్నది- కావున లాలనంబున దీనిం బ్రకృతి నొందింపవలయు- ప్రకాశంబుగ- ఏమేచెలియా నేనిట్లంటినని సంకోచించెదవే- నేనిట్లంటిననియలుగుచుంటివాయనికుసువునంగూర్చిగండంబులంజుంబించున్నది.

మంజ. సవైలక్ష్యస్మితంబుగ- అమ్మా యిపుడునీచే నిట్లాదరింపంబడి జీవించితినే.

ఆమో. ఇప్పటికియు నీమనంబునకుం బ్రసాదంబు గలిగెనని నాకుందోచదే.

మంజ. ఏమే సకియ యిట్లంటివి.

ఆమో. ఇఁకనిటులననే- నీడెందంబు ప్రసన్నంబయ్యెనని తెలిసికొంటెనిగదా- కావుననీకొక్క నుడువు నుడువనాయుల్లంబు పల్లవించిన వేడుక నుల్లసిల్లుచున్నదే.

మంజ. అక్కరో నీవెప్పుడు వక్కణసేయఁదలచిన నాకుహితంబచేయుటకుం బరికించి దుర్వహ భరంబారోపింపఁ బ్రార్థించువానివలె నెక్కుడు జతనంబునంజెప్పెదవే- సహజవాత్సల్య సౌజన్యమాన్యులగు వారివర్తనం బాదియందతి పరుషంబైయవివేకంబునం దెలియంబడియు నేవిధంబునైన దానిం బరిగ్రహించు వారలకుం గ్రమం

బున నమలగుడ ఖండంబు తీరున ననవరత రసం బొసంగు తల్లులు స్వరూప సంభూత ప్రేమధామ మానసులైనం బసిపిల్లలకుఁ బాలువ్రాయు తఱిని సోరు దెరువకున్నం జెక్కిలి నొక్కుదురుగదా- అక్కతంబున నీవును నాకొక్క కొ్రిమ్మేలొనరింపం బరికించి యిట్లొనరించుచున్నావు- నాయంతరంగంబంతయు వింతగాక నీస్వాంతంబునకు విదితంబ- కావునం దావకీనాను శాసన సుధారస సమాస్వాదవ్యగ్రతా గ్రహంబులగు నాశబ్దగ్రిహంబులకుం దూర్ణంబుగఁ బూర్ణంబగు సమ్మదంబు సంధానింపుము.

ఆమో. సావందవిలోక నంబుగ- ఓసి పట్టీ యొక్కటి వినిచెదనీహృదయమ్మున గాటముగ నాటింపుము- నీవింకం గావ్యపాఠంబులు నిలిపి ప్రత్యహంబునుం గొన్ని యలంకార ప్రబంధంబులుం గొన్ని రూపకంబులుం జదువ నేఁగోరెదనే.

మంజ. అక్కరో విధివిధంబున సంధానింపందగు నీవ్యాహారముల మధుర తరవ్యాహారంబులం బోలియాస్వాదింపం బ్రతిక్షణ ప్రితీక్ష మాణంబగు నామానసంబునకు విలంబంబు సలుపుట సలుపులం జేయుటకయకదా.

ఆమో. ఇంతత్వరయేమే వాకుృచ్చెద వినుము- దినదినంబునంబూర్వాహ్ణంబున నీయలంకార నిబంధనంబులు నపరాహ్ణంబున నీరూపకంబులుం జదువుచు నేతదంతరా వసరంబుల నధీతపాఠంబుల నామ్నాతంబు లొనరించుచుం బఠిష్యమాణ పాఠంబులు యోజించుచు విశేషి శ్రద్ధాసహనంబులొప్పఁ జదువందగు.

మంజ. మహతినీయానతిగదా నాకు సౌభాగ్య కల్ప ప్రతతి- నాశిరంబునకు సువికచ విచికిల కుసుమ సమాకలిత మహితమాల్యంబునుగదా.

ఆమో. ఓసి పసికూనా నాయెడల నీకెంత వినయంబేమే.

మంజ. అక్కరో గోష్ఠులయందు మాయవ్వ వంటిదాననైనను విద్యావిషయ సంభాషణ ప్రసక్తులయందు మామకీన మానసంబీ సాహసంబునే యనేరదే.

ఆమో. నేనేమిచెప్పుదు నీకెద్దియిష్టంబట్లు వర్తింపుము- ఈకృతులభినవ సంకేత నికేతనంబులు గాననవ్యవృత్తి తనభ్యసింపందగు.



మంజ. ఈజనంబు త్వదాజ్ఞా వశంబెకాదా మహదనుగ్రహంబని మహోత్సాహంబున సమర్యాదంబుగ నట్లు స్వకార్యంబు నిర్వహించుచున్నది.

ఇట్లు కొంతయవసరం బపసరింప.

పిదప నేతెంచుచున్నది సలలిత డోలాయిత భుజవల్లీ మూలవాచాలవలయకోటి స్ఫుటిత మణిగణ ప్రభావిభాసిత పరిసర ప్రదేశయునిరర్గళ సంవర్ధ మానయావన మదనిభృత పరితః ప్రసారి తసితాంభోజ దళపృథుల నయనకాము దీవిశదీ కృత ప్రాంత దేశయుత్క్షుద్ర జనమనస్సు క్షౌద్రధారాధోరణీ మధుర రసాధార విభ్రమప్రపంచన ప్రసంజిత వర్తనయు బహువిధ సుగంధ ద్రవ్యసంభరిత భవ్యతమ వీటీగంధ కషాయిత వదన ప్రసూత బిసప్రసవా ధ్యాహారా భ్యాగతా భ్యాశదేశ పరిభ్రమ ద్భ్రమరగణ నివారణ నిపుణనాసికా విలసచ్చాంపేయకయు నగుచుం గుంభస్తనియను చేటిక.

మఱియును.

సీ॥ క్రొమ్ముడి ముడిచిన కుందకుట్మలముల దండనిండిన తావినండసేరి। జుంజుమ్మనెడు సద్దుసొంపుగ సలిపెడు తేఁటికూటువలను దీరుమీఱు। పరివర్తి తాస్యతాప్రత్యక్ష నాసికా చంపక కోరక చాకచకిని। నదలించుచును దృఢన్యస్తపాదాగ్ర సంలగ్న మంజీర విరావములను। నిబిడవలమాన మణికింకిణీ విరాజమాన కంకణ రశనాది మహితశింజి। తములఁ దనరాక దెలుపుచుఁ దనరువీటి। కాయ తామోదవాసితాశాంత యగుచు ॥౨౩॥

ఆమో. దానిమిటారంపు నటనలంగని (స్వగతముగ)

గీ॥ అల్పులగువారు దమవృత్తి నరయుచుండి। యుసువిశృంఖల వృత్తిచేనుత్కటాళి। యబలమున నుందురనుట యరయ నిక్క॥ మందుకిదియని దర్శనంబగుచునుండు ॥౨౪॥

కుంభస్తని. ఆమోదరేఖంగాంచి యడుగువ యడర- అమ్మగారూదండాలు చిత్తగింపుడు.

వి. సాశ్చర్య నిశ్చలతార విస్తారిత నయనంబుగ - ఓహో యెంతమాటంటివి.

కుం. ఇది నేనన్నది గాదు సామ్రాజ్ఞి రాణిగారు సెలవిచ్చినదే.

వి. అన్నా యెంతవింత- అదియు నిజమే కావచ్చును - ఇంత ప్రపంచమం దెక్కడెక్కడ నేయేవి శేషంబులున్నవో యెవ్వరెఱ్ఱు తెలియ నేర్తురు - ఈశ్వర సృష్టియందు వైచిత్ర్యంబాయనకే కాక నీరికిం దెలియ నలవడు - కానిమ్ము దేవిగర్వ సంబంధంబు నిక్కంబుగ శిక్షలబంధంబయ్యెనా.

కుం. అందుకెద్ది సందియంబు

వి. ఇదివరకు వచించిన వచనంబులలో నెది నాకు మహానంద సంధాయకంబు మించిదే పిమ్మట నేమయ్యె

కుం. అయ్యెడ రాణిగారు వారినియువురం గొంతసేపు రెప్ప వాల్పక పరికించి తాన నెమ్మిదాన నీరలకుం గైయిచ్చి రావించిరి.

వి. పదంపడి.

కుం. రాణిగారు మిగులం గారవించి తాము గూర్చుచున్న పరుపునందె వారికిచ్చ వచ్చినట్లు తావొసంగిరి.

వి. అంతవట్టుకు గారవించెనా.

కుం. ఇదియెంతమాత్రి.

వి. మఱియు నెట్లు గారవించె.

కుం. వారియువురు గూర్చున్న పిమ్మట- ఓకన్నియరతనములారా మీరలియువురు మెయిదారులై యేతెంచిన లెస్సబవిసి యేలిక కలుములగా కావున్న మముంగనికరింప విచ్చేసిన వేల్పుల వెలదులగో నక్కాణింపం గోరెదనని యడిగిరి.

వి. గగనంబుననుండి యిట్లవతరించుటంజేసి యిట్లను నూహింపుమట యనవరతంబు సాంప్రతంబ అందుకు వారేమి వచించిరి.

కుం. వారిలో బెద్ద దువు నిట్టూర్పు నిగుడించి- మేమట్టి వారముకాము- ఇది యుత్తమ క్షత్రియ కన్య- నావలనం గతిపయంబులగు కలలం గాంచినది- సోదరీ నిర్విశేషంబుగం బాలితయయియుండు- ఒక్కకారణంబున నిట్లే తేరవలసివచ్చె- తక్కినవృత్తాంతంబు కాలాంతరంబున దెలుపందగుం గాని యిత్తరి జెప్పందగదనియె.



వి. పదంపడి.

కుం. అయ్యెడ రాణిగారు వారల మిగుల మన్నించి మీ యిచ్చవచ్చినట్లు మా యంతిపురంబు నందుండవలయునని యడంకువమీఱం బలికి వారల నిలిపిరి.

వి. పిమ్మట నెట్లుండిరి.

కుం. ఆరేయి వారికిందగిన చందంబుల మెసంగుటలం గావించి కొంతయుదను చదువులమాటలం గడిపి పవ్వళించిరి.

వి. మరునాడేమయ్యె.

కుం. పొద్దుటి పూటయుం గొంతసేపే మేమో విద్దెలపలుకులం జరిపి యెచ్చు మెచ్చుకొని కొంతతటి నాకడనుండవలయునని వేడికొని పూలతోటలోనుండు పటికంపు మేడలో వారిని విడియించి మీరిచ్చట నేయుండవలయు-మీకుం గావలయు నరతంబులెల్లం బనికత్తెల చేనందంజేయుదు- నేన యప్పుడప్పుడు మీకడకే తెంచెదనని వినిచి యప్పుడు నాతోనున్న చంపకాంగికిని శంపాలతికను మాత్రమే వారికొలువున కానతిచ్చిరి.

వి. అందుకెద్దియేని కారణంబుండునా.

కుం. అందుకు కతంబు మిగులంగ నున్నది.

వి. అదియెద్ది.

కుం. వీరలం జూడ యొరులకుం బొడసూప కుండునను తలంపే.

వి. అగుంగాక దానంగలుగు నవర్థంబేమి.

కుం. అట్లయినం బబువువారి కంటంబడగలరు గదా వారు.

వి. ఐతే నేమి హాని.

కుం. ఆయొయ్యారిప్పు నాయనా నాపబువు వారాచిన్నపడుమంగనినం జేపట్టు గొన నూరకుండుగా.

వి. అట్లగునా.

కుం. మరేమి- దానిచదువుల విలువఁ దెలియ నేనేరనుగదా- ఆదిగొప్పరాచ కొలమందుఁ బుట్టినందుకు దానిలక్కనంబులే సాకిరి తనంబిడు- దానింగన్న యేరకినిజ మెయి నూనిన మెఱుపు తీవయో కాకున్న నట్టిబేసమ్ముల దొరవలపుల తల్లియగు బలు సత్తియో లేక తాతదేవర యెల్లజగంబులం దుండు చక్కదనంబునకు మారుగ నెంత జతనంబొనరించియో దీనింబుట్టించెనో. ఇవ్వి దొలుఁతంగల తరకటింపులు దెలవరుల కు నేరికిం గలుగవు.

వి. అన్నా యీనాడున నీమాడని రాచపడుచులు లేరుగదా నీకయిఁత య బ్బురంబయ్యెనా.

కుం. నేచూచిన నాడిది యొక్కటేనా- పెక్కునాడులెరుంగుదు- అందలియ లరుబోండ్లు రూపరితనంబునఁ బేరొందిన వారిలో నేఁ గాననివారుండిరా. ఇదేమిలెక్క కేజేలపై దలులం బెక్కులఁజిట్టలంగాంచితిగదా- ఎజ్జగంబువంచలి యువిదలును దీని సుద్దికి పేరువడశేరు వారందఱు మగవారికే వలపులం గులికించిరికాని నీవెచెపుమా యేయాఁడుది యేయాడుదానికిఁ గాని యొక్కడైనం గౌగిలింతతమిఁ గలుగఁజేసెనా దీనిరూపైన నట్టిదియ- ఇందుకు నేన సాకిరినై కణకణలాడు వగ్గుల నిగ్గు మినుకుఁ నీను మానికంబులంబో లెదోయిల ఘూడునాడులైనంగట్టిగఁబట్టనోపుదు.

వి. అట్లుగా అన్నా యెంతవింత- కానిమ్ము. అట్టిసంశయంబుఁ గలిగిన దేవివా రినెందుకు విడఁగేదు.

కుం. వారిగోవంబులంజదువులం బట్టి వాగుదనకడనుండ వలయుననుక్రిచ్చు విచ్చనెచ్చరిక సేయనేరమి.

వి. అట్లయిన వారినెక్కడనుంచె.
కుం. పూలతోటలోనుండు లనకై సేతయుప్పరిగలోఁ బైయంతరువులయందు

వి. అబ్బా రాజాలైననీపెసెలవులేక ప్రవేశింప నలవడని తావుగదాయది.



డు పనికత్తెలము మేము ముప్పురముంటిమని వలికితిని గదా - మాలో వారినిరువుర వారింగొలువ యానతిచ్చి మమ్ముంగని వారిరాక మీముప్పురకంటె యెరులేరును నె ఱుంగరు గదా- ఎల్లైనఁనాజాడ బయలు వెడలిన మీముప్పురనుసురలతో నుండఁగ నేపాతించి మీద గోడ గట్టింతునని గోరంబుగ నొట్టు వెట్టికొని తీండ్రంబుగ నాన తిచ్చె.

వి. దేవి యన్నిటం భామినీమణియ కదా.

కుం. అన్నిటననుటకు నేనెఱుంగను గాని యలుకంబట్టిరయితేసట్టిరి.

వి. కానిమ్ము - ఎవ్విధంబునైన రాజునకుఁ గుశలంబుగావలయు.

కుం. ఆయనగారిసేమంబకదా మనకందఱకునుసురులమందు - ఓసామీ మీ కు దండములు - ఇయ్యెడ మనము దడవుండఁగూడదు - జరుపంగల కర్జంబుల జరుపు డు - నే సెలవు గైకొనియెదనని నిర్గమించుచున్నది - విదూషకుండును మహామార్గంబు ప్రవేశించుచున్నాడు.

పిమ్మటం బ్రవేశించుచున్నారు విదూషకుండు కంచుకియును.

కం. ఓయగ్రజన్మశేఖరా జోహారులయ్యా.

వి. ఓహో భద్రముఖుఁడా యిష్టంబుల వర్ధిల్లుము.

కం. పెరనాడునుండి యెప్పుడేతెంచితిరి.

వి. ప్రత్యూషంబు సమీపింప గృహంబునకేగుదెంచితిని - పదంపడి మహా రాజు వయస్యదర్శనత్వరమాణమానసుండనగుటం దదవసరసముచితంబులగుకృత్యంబులం గతి పయంబులననిర్వర్తించికొని యేతెంచితిని.

కం. ప్రభువువారి నడుమంగొన్ని దినంబులనుండి మీరాకకు దద్దయుం బ్ర తీక్షించుచున్నారు.

వి. ఆహా ఆశ్చర్యము - మాదృశులమ్మహారాజునకెందరు లేరు - లేదా యాన్నృ ప శిఖామణి యాశ్రితవత్సలుండు గావున నటులుంగావచ్చును.

వి. మఱియేమి.

కం. ప్రభువువారికి మీరు పంచప్రాణాధిష్ఠాన దైవతంబని.

వి. అదియెట్లు.

కం. యావద్వ్యవహార నిర్వహణప్రధానులైన ప్రధానులకే దుర్లభ దర్శనుండగు రాజు నిరంతరాభిలషిత భవద్దర్శనుండగుట.

వి. స్వమనంబున - వయస్యుని స్థితి గొంతవట్టుకుఁ దెలిసియున్నను నవిదిత ప్రాయంబుగ నభినయింపవలయు.

ప్ర. నయనిలయుండగు నృపమండనుండు ప్రధానులకు దుష్ప్రాపవిలోకనుండగునా.

కం. ఈసమయంబిట్టిది.

వి. ఆవృత్తంబెట్టిదో యుండుగాక మహారాజవయస్యుండీపాటికిఁ గృతస్నానుండై జపంబొనరించుచుండుఁగదా యని జపశాలా మార్గాభిముఖుండై చనుచున్నాఁడు.

కం. ఇప్లైచ్చోటికరుగుచున్నారు.

వి. మహారాజనికటంబునకే.

కం. ప్రభువు వారిచ్చటలేరు.

వి. మఱియెక్కడ.

కం. నందనోద్యానాంతరంబునందలి హేలానిలయంబను హీరమంటపంబున.

వి. జపహోమావసరంబున వినోదోచిత మంటపాశ్రయణంబున కేమి కారణంబు.

కం. అస్వాస్థ్యంబ.

వి. అహా నావయస్యుండస్వస్థుండైయున్నాఁడా - ఎట్టిది యాయస్వాస్థ్యంబు.

కం. అద్ది యెరికిం దెలియ నశక్యంబు - ఐన మీకశక్యంబుగావలయునని యామంటపంబుచెంతకుం దోడ్కొని పోవుచున్నాఁడు.



వి. భద్రముఖా నేనిచ్చట నుండెదఁ గాని నా రాక నావయస్యమణి కెఱింగింపుము.

కం. అజ్జబ్బ నాకచ్చటకుఁ బోవనానతిలేదు - మీరంతరంబునకుంబనివినుండని ..గమించుచున్నాఁడు.

పిమ్మటం బ్రవేశించుచున్నాఁడు - మహారాజు మధుకరుండు విరహజ్వర భరితశరీరుండగుచు.

రా. ఆహా నియతి విపరీతంబైన నంతయుఁ దద్విధంబయగు తథ్యంబ.

చ॥ హిమకర రశ్ములుగ్ర నిటలేక్షణ వీక్షణ విభ్రమంబులోఁ । గమల సతస్పరత్నవనకంబుల హేళ్వర ఫూత్కృతంబులో । విమల పటీర కర్దమము వింతగఁ జిత్రిక పంక శంకమా । సుమకిసలాత్మ తల్పమును శుష్మకణావలి కల్పితాత్మమా ॥ ౧ ॥

సీ॥ పల్లవంబులనఁ దత్పాదముల్పాణుల నిజసంగ కృతహిమానితనలరుట । పీయూషరశ్మినా ప్రేయసీవదనంబ నయన కర్పూర కణరుచియగుట । చందనమనఁ దద్ఘనమహః పటలంబ దర్శనమాత్రశీ తలదమగుట । బిసవల్లులనఁగఁ దద్బింబోష్ఠి భుజముల స్పాంగ సక్తిన్యస్తసంజ్వరములగుట । సరస సారస దళవిలసత్కిసలయ । విసర విరచిత హారియంత్ర వితతులెల్ల । శుష్మసంప్రాప్తి శీతల తోపలబ్ధి జనకములె తత్కుచవసన సరణిఁజూడ ॥ ౨ ॥

చ॥ మదనుడనంగుఁడౌటఁ గోరమాలిన డయ్యాపు మేను బూని నాయెదనివసించి మించిన వహేలన బుద్ధిని బాధసేయునీ । హృదయ మహీనహారి మహితేక్షతమాగ్ని శిఖాళికంబునోతవయవాశ్రయంబు విడి తద్దయు సౌఖ్యము లెట్లుగాంచునో ॥ ౩ ॥

క॥ ఇపుడీవల దొఱవేకిన । దుపుటకు సెల్లొషధీములు డొంకునకటత । ల్లప శాంతర వీటి యుదశ । నపరిచ్ఛదమబ్బదేని నాశమనిజమా ॥ ౪ ॥

చ॥ సమసిపిశాచమై పడిన సద్విధులన్ సమయింప వచ్చుఁగా । కమహితజీవితుండయి సగర్వతఁ జేరిన భూరిమార్గణక్రిమముల సంహరింపతగు గష్టముగాదిది వచ్చిచావదు । న్న మదను వీని సెట్లు కలనంగని సెట్టన సెట్టవచ్చునో ॥ ౫ ॥

సీ॥ అచలాత్మ తను మెప్పు కుచతటి ఘనగసాత్మతమీఱు విలసదంతరము చేత । శుచిమయాత్మతమించు శుభరదనంబులఁ గమలగంధాత్మత ఘనత మీఱు । వదనాంతరంబున వరలు పుష్కరమయాత్మత మెచ్చు నవలగ్న తలము చేత । నరుణాత్మకంబగు నధరదళంబుచే నమృతాంశుమయతనొప్పు ముఖమున । స్ఫుటిత మూర్త్యష్టకంబుచే ఘటిత మగుట । శ్రితకమలపాణి వృషపదిశ్లిష్ట సర్వ । మంగళాభిఖ్యత నిదియ మహిమహేశ్వ । రాత్మరక్షణ మిడఁదగు నతనువలన ॥ ౬ ॥

ఆహాహాయన ప్రాయనాడికంబగు నీసమయంబు నెట్లు గడుపుదు - వయస్యుండు నిదివరకును రాక తడవు సేయుచున్నాడనుచు నితాంత చింతాతంతు సంతానసంయమిత స్వాంతుండగుచున్నాడు.

పిమ్మటం బ్రవేశించుచున్నాడు విదూషకుండు.

వి. ప్రీతి సిద్ధ సర్వాప్త జనప్రవేశుండగు వయస్యుండు కంచుకి ముఖంబున నన్నాకారితుంజేసెఁ గావున హేలానిలయాంతరంబు ప్రవేశించెదనని సమీపించి గవాక్షాంతరంబున విలోకించి - ఆహా యెంత కష్టంబుపస్థితంబయ్యె.

సీ॥ వాఁడియు వరలు దివాతనమల్లికా సౌరభశేష గుచ్ఛంబు పగిది । మంత్రిసంరుద్ధమై మల్లడి పాల్పడు మహితాహి కైవడి మదనిరంత । నిష్యంద నిస్సార నిర్విణ్ణవారణ వరము చందంబున వలయమాత్రి । లక్షణీయాత్ముఁడు రజనీశుచాడ్పున పాటినొందినసరిత్పతివిధమున। నహహమహిమ మహత్తరమహిమ హేంద్రమణి సమహాగుణ మణీరమాప్తశరధి । యైన యీనావయస్య పంచాస్యుడిపుడు। దురవలోక దశావశ మూనుఁడయ్యె ॥ ౭ ॥

అని తలంచుచు సమీపంబునకుంజని - జయించు జయించు వయస్యుండు శేషాభిలాష విశేషలాభంబున.

రా. స్వ. సూనృతాస్పదంబగుతబ్రాహ్మణాశిషంబు.

ప్ర. వయస్య యిచ్చటనుపవేశింపుమని యతని కరంబు గొని కూరుచుండంజేసె - ఓయీ వయస్యా యెంత తటికి నాకన్నులకుం గర్భూర ఘుటిక వైతివి.

వి. వయస్య నాకియ్యెడ నియతిచే నుపస్థితంబైన యర్థంబు నీవ వచించితివి-



అని వయస్యుని సావధానతం బరికించి యంతరంగంబున

గీ॥ మోయిలు పింజలుగప్పిన మురిపెముడిగి । యడరు చంగురు తీరున నమరు మోము ॥ మించు మంచడరించిన యంచి గలుగు । తమ్మికమ్ములకిమ్ములై తనరుఁ గనులు ॥ ౮ ॥

గీ॥ కాంచిమించిన యుపరంజి కరణి మేను । మోము సూర్పుల సోనకు మొగిలు కలిమి । ఎండ వెండిన తూండులపండితనము । నొడలి భాగము నితనివి గడిమి నొందు ॥ ౯ ॥

క॥ నవకము గడుఁజెడిపోయిన । వవయవములు దొలుత టవియ యగుటనితండా । యవని వరుండని తెల్పెడు । శివశివ తిలతరులు గ్రీష్మ సింగువు బోలెన్ ॥ ౧౦ ॥

ప్రకాశంబుగ - ఏ మోయి వయస్యా నీయాత్మ పరికింపం బ్రబలకరాధి సంరుద్ధంబు కరణిఁగానుపించుచున్నది.

రా. వయస్యా యేమి వచింతు.

వి. ఉన్నదే.

రా. ఎద్దియుఁ గానంబడదు.

వి. నీయంతరంబు దొల్లింటిదై యుండెనా.

రా. అద్ది తొల్లింటిదే కాక నడుమ మఱియొకటైతెంచునా.

వి. నీయాత్మ తొలుతంబోలె నవికృతంబై యుండెనా.

రా. నీకేమి తోఁచుచున్నది.

వి. వికృతంబైనదని.

రా. నీవితర్కంబు వితథంబగునా.

వి. తన్నిదానంబు దురూహంబగు.

రా. ఏమని వచింతు.

వి. ఓప్రియవయస్యా యీయాధిమూలంబు నావలనం గోపనీయంబె.

రా. మానసికవ్యాపారంబు లాత్మకుంగోపనీయంబులగునా.

వి. నేనెవ్వాడను.

రా. నీవాత్మవేకావా.

వి. అట్లయిన నాకెట్లు తెలియకుండు.

రా. తెలిసియయుండు.

వి. ఏమని.

రా. స్వప్నంబని.

వి. తత్ప్రకారంబెట్టిది.

రా. సావధానమానసుండవై యాకర్ణింపుము.

చ॥ ఫలభరనమ్రకిమ్మిరి బహు భివ్య మహీరుహ బృంహిత శ్రీమంజులకుసమ ప్రసూత తతశోభన సౌరభపూరితాంతర। స్థలమమలాంబు భూరివిధ సారస క్లృప్త పూర్ణ దీర్ఘికా విలసద దభ్రవిభ్రమకవిభ్రమ రౌఘమహార్ఘ నాదముల్ ॥ ౧౧ ॥

అగునొక్క మహోద్యానంబవలోకించితి.

వి. వయస్య లెస్స లెస్స. పదంపడి పదంపడి

రా. ఆయారామాంతరంబున నొక్క మహాసౌధంబవలోకించితి.

వి. సానందాభినయంబుగ - వయస్యా అది యెట్టిది.

రా. వినిచెద నాలింపుము.

సీ॥ అతిమృదు తూలపూరిత దృఢతల్ప చైనకక్రమపటీక్లృప్తకశిపుతతుల। నతితాలముగ్ధపయః ఫేనవిశదాంతరాసక్త ముకుర చిత్రాళిభిత్తి। మూలకల్పితమహా మూల్యోపధాన వీథులసకల పరికరలలితాస। నవయువ రేఖల నవరత్నదీప పాంచాలికాదిమహార్థ సముదయములు। దత్తదుచితవిషయ సజ్జితబహుభేద। శిల్పకల్పిత మణిమయూకల్పకాంగ। సంప్రకీర్ణేక్షణా స్వాద్యసకలభాగ్య। తత ఘనా వద్ధసుషిరవితానములను ॥ ౧౨ ॥

అలరుచున్నదియు.



శా॥ నీలోద్ధోజ్వల చంద్రపాద విసరోన్నిద్రోప వన్యంతరో దారోదంచిత దీర్ఘికా కుముదసంతానప్రకాశాపహృత। స్ఫారామోదసమీర దారితముఖస్ఫాయన్మహా మాఘ్య భూసౌరభ్యస్ఫురణోర్మికా సంవళిత కుత్స్యాభోగ దృగ్భోగముల్ ॥ ౧౩ ॥

చ॥ ఉపరినిబద్ధ చంద్ర కిరణోత్కర సంక్రమణస్ఫుట శ్రవద్ద్రవపుల విధూపలోద్ద్వ మిత విస్తృత వాఃపరిపూరితాశ్రిన। ద్ధపరమ హేమనాళ వితతాస్య విదృబ్ధనిరంధ్రి రంధ్రకాళ్యుపచితమైహిక ప్రసరణోదిత శీతలతోప కంఠముల్ ॥ ౧౪ ॥

వి. సానందంబుగ - బాగుబాగు పిమ్మట నేమయ్యె.

రా. సోత్కంఠంబుగ - ఆమహాసౌధంబు చతుర్థ భూమికాముఖశాలాపురోంచలంబున మహారాజ కన్యార్హంబులగు సమున్నత పీఠంబులం గూర్చున్న నిరువురు కన్యలంగంటిని.

వి. సోల్లాసంబుగ - తర్వాత తర్వాత.

రా. అయ్యెడం దోలుతవినిద్రితుండైన విషమశరుండు నాహృదయంబున మేల్కనియుదయుండై స్వాశ్రయు భేదనంబొనరింప నుద్యోగించె.

వి. సాశంకంబుగ - అవసరగవేషణ కుశలుండుగదా విషమేషుండు - వెనుక వెనుక.

రా. అవిదితస్థలంబున నుండు నపరిచితలైన వనితల కడ కఱుగుట నీతిగాదని యెఱింగియుం దదీయ సదేశంబున కతిసాహసంబున నేగితి.

వి. వయస్యా యీసాహసంబు నీదనుకొంటివే కాదుకాదు-బలాత్కార ప్రవృత్తయగు నాదర్పకుండే.

రా. సజుగుప్సంబుగ- వయస్యా యట్లుకాకున్న నిట్టి యవినీతార్థంబు నిశ్శంకుండనై యేనొనరింతునే ఇపుడిట్లు నేవచించుటగాదు. తొల్లి నీవెరుంగవా నావర్తనంబు.

వి. కావుబట్టియకాదా యిట్లువచించితి- మంచిది పదంపడి పదంపడి.

రా. నేనతిధీరుండనై తమచెంతకుంజేర వారలును సవిస్మయంబుగం గాంచిరి.

వి. ఇద్దియు విశేషంబ తాదృశావసరంబునం దాదృశస్థలంబున నజ్ఞాత పురుష ప్రవేశం బెవరికి విస్మయ జనకంబుగాదు.

రా. అంతియకాదు- మానస ప్రసాద సూచకంబగు వికాసంబున నతరు నిరీక్షణంబులం గాంచిరి.

వి. నీవు మహారాజ లక్షణ లక్షితుండవుగదా- వారును మహాకుల ప్రసూతలు గావలయు- కావున నీయెడం దగిన గౌరవ విధాన బుద్ధి వారికుదయించె పదంపడి పదంపడి.

రా. వయస్య కతిపదమొకాని యవీయంబగు కన్యారత్నంబు గద్దియ నించుకైనం దొలంగక నిబ్బరంబుగం జూచుచయుండెనని యర్థోక్తంబున.

వి. వయస్య తన్నిదానంబు నీకు గురూహంబయ్యెనా.

రా. కేవలంబు తథావిధంబుగాదు నిశ్చితంబునుగాదు.

వి. నీకేమిదోచినది.

రా. తారుణ్య సౌందర్య సత్కుల ప్రసూతత్వాది గర్వంబునని యొక పక్షంబున.

వి. వయస్య యిద్దిసూహంబుగాదు.

రా. నీకేమి దోఁచుచున్నది.

వి. భవదీయ తారుణ్యాది లక్షణ నిరీక్షణైక లౌసత్వంబున.

రా. నీకట్లు దోఁచెనా.

వి. ధీరోదాత్తుండ వగుట నటునటించవు గాని నీమమాత్రమట్లుదోఁచలేదో నీవయాత్మవని వక్కాణించెదవుగాని హృదయ మర్మంబు విడనాడవు.

రా. సానునయంబుగ- వయస్య కోపింపకుము ఒకపక్షంబున ననియంటినిగదా.

వి. సరేమంచిది- పిమ్మటనేమయ్యె.

రా. పెద్దయగు లలనా లలామంబు సౌహృద నిష్యందులగు విలోకనంబుల నాశంకాతప్తంబగు నాశరీరంబు శీతలితం బొనరించుచు లేచి పతిసంచలితాంగుగ సు



వి. బాగుబాగయ్యె పిమ్మట.

రా. నేనుగూరుచున్నంబిదప నాపె నిజపీఠంబునం దుపవిశించె.

వి. వారియుపురం గంటివిగదా- వారయ్యవసరంబున నెట్టిభావంబునకుం బాత్రంబులైరి.

రా. వారిలోఁ బెద్దయవీయసీభావంబునకు.

వి. యవీయసియో.

రా. సాపత్రపతన తానమండగుచున్నాడం.

వి. విస్మృత ప్రతిజ్ఞా తార్థుండవైతివా.

రా. సాహసం బవలంబించి- లేదు వయస్యా వచించెదనాలింపుము స్మరానల సందగ్ధ హృదయ సంజీవన సుధాధారయని.

వి. సానందంబుగ- సాధువు వయస్యసాధువు- ఆబాలికయట్టి లావణ్యాది గుణ మండితయే.

రా. దానిలావణ్యం బట్టిదయా-ద్వితీయయయుం దానికి సోదరీప్రాయ శుభలక్షణంబ.

వి. భవచ్చేతస్సేనయగు నీబాలిక రూపంబాలింప మిగులఁగుతూహలంబగుచున్నది.

రా. నాచిత్తంబునకు వినోదకారణంబవైతివి- వచించెద నాలింపుము.

సీ॥ లేనెలవెలిమాలి లెస్సల్లడించిన దాని నెన్నొసటికి దారితోడు। మరువిం డ్లు వాడక మఱిమఱి నెఱిగిన దానికన్బొమలకుఁ దరములగుమ।వల్లగల్వలు సేరినయము సేవించినదాని కన్నులకగు దవ్వుమండ। సంపెగ దిరమయి సొంపొందఁగొల్చినదాని నాసకుఁ దగుదరికిఁజేర॥౧॥

దొండపండుల లచ్చి దోడరికొల్చిన దాని వాతెర కరుదునివాలిఁబట్ట।మగరాల యుద్ధరుల్ మసలక నవియూన దాని చెక్కులులకు దాపునుఁడు। తమ్మిపూవులక ల్మి దావి నెచ్చుట దాని నెమ్మోమునకు నగు నెమ్మిసకియ। తతిమబ్బు లుబ్బులుడల కొనినందాని నెఱుల నెనఱులంద నేర్పరులగు॥౨॥

బంగారు తూడులు బవిసినక్కటికంట దాని భుజములలతనుగడింపు। చెందొవల్ గందర్క సేవసేపినదాని కైదోయిచే బూన గరువమొందు। పైడిఁ కొండలుసేరి బత్తిఁ గొల్చిన దాని చనుదోయి యందంబు సైపఁదగును। ముచ్చిమ్మ తిన్నె సొంపులఁగ(ల)చిన దాని వెన్నుకు వెన్నాను నన్నువయగు॥ ౩ ॥

నవకమునంటిన వటులు గొల్చినదాని కురువుం సొంపులఁగొమరు మిగులు। కుసుమ పాట్టల చెల్వు గోరిఁగొల్చిన దాని నునుపు పిక్కలనొత్తమూలుకొనును। తలిరాకు కలుములు దవిలిగొల్చిన దాని యడుగులకగు పరవుడులు గాఁగ। నపరంజిమను మెత్తనిజిరైన దాని మేనికి జాయ సరిగాఁగ నిండియుండు ॥ ౪ ॥

గీ॥ కాన మెండుగ నిండిన కలికితనము। మెప్పుచున్నట్టియన్నియయాగొడలిపాళ్ళ। లోనొకటి కైనను బుదెమిలోన మాఁది। గాక యున్నట్టి సొబగుల కలిమిరూపు ॥ ౧౫ ॥

చ॥ కచనిచయంబు మేచకవికాసకనాకచి చాకచక్యమారుచిర నిటాలమాళిరరోవితెలాళలి లబ్ధవర్ణమా। కుచరుచిచారు హేమనల కుట్మల కోటి పదాపదీడ్యమా నచిర రుచిందనుద్యుతియు హాయి గళాగళి నీసడించెదుర్ ॥ ౧౬ ॥

గీ॥ అపుడు విరిసిన కైతక హారపత్రి కోటి శోభల మిగులన కూటవృత్తి। నపరంజేయునఖావళి నతిసముల్ప। దాత్మికంబులు దాని దోరంతరములు ॥ ౧౭ ॥

సీ॥ తన్ముఖ శ్రీగోష్ఠి దగుల మూషాంతరసారసారికగుదోషాకరితయ। నయన లక్ష్మీనర్ణనము మనంబునఁ జేరళ కులావళికిని విసారతయగు। కన్బొమల్లనుగొన్నఁగాము కోదండమునకు నగు మధు పగుణాభిషక్తి। దశనరేఖా శ్రీలదర్శింప శౌక్తికశ్రేణికి ముక్తాత్మ రీతియ యగు॥ విమలకపోల భావిభవముల్లముసేరమణి దర్పణము దృపన్మయమ యగును। సురుచిర గలశీల చూడ్కులకిక్కిన నలకంబు వునకుశంఖాత్మతయగు। తదురోజ సౌందరీ ధార వీక్షించినఁ జక్రిముల్సరసాత్మసాదితములు। కాను కన్పడునేని గగనంబునకుఁ డ్రివిక్రిమ పదత్వముల సత్క్రిమమయగును॥వళిపాళిమాంజాళి ప్రాసిఁజాచిన నిత్య భంగతాసక్తి తరంగతతికి। రుచిర రోమావళి రూపుగాంచిన నల శ్యామలాహికటిలేశ మత్తయుతగు। పొక్కిలిపాలవు చూపులకు పాలైన నాసరసికి నెపుడు గాసారతయగు। ఘనజ ఘనాభిఖ్య గనసైకతములకు ఘనగోష్ఠిదుర్విలో



కతయ తనరు॥ గురునితంబాభిఖ్య గోచరంబగునేని చక్రంబుబహురంధ్ర సక్తమగుగు। మంజులాంక శ్రీలం మదిఁజేరఁగరముల కగును మాతంగాత్మ తాపకృష్టి। సద్గతి ప్రిధిత తచ్చరణ సౌషమిఁ జూడ పద్మావళికగుజా పంకజనిత। తనువల్లి సుషమగన్గొనవ సద్యఃఫుల్లకనక ప్రియూనాళి కాంచనంబ॥ యట్లు గావున లోకత్రియాశ్రయాన। పద్య సౌందర్య సంపద వరలఁదీసి। మదనుడఖిలజగన్మనోమథన విధికి। దానిజేసెను విక్కమై తనరు నిదియ ॥ ౧౮ ॥

గీ॥ దాని కౌనుకు సరిగాఁగదగుదు ననుచుఁ। బల్కి చదరున సింగంబు పన్నిదంబు। వలన బరికించు వేళను దొలగితొలగి। నోరు దెఱచుటచే దెఱనోటిదయ్యె ॥ ౧౯ ॥

వి. ఓవయస్యా తాదృశకన్యా నిరీక్షణంబునం గృతాధుకాండవైతివి - పిమ్మట నేమయ్యె.

రా. ఆబాలికయను పాతరంబుగ నభినవ హిమకర కిరణ సంస్పృష్ట కువలయదళ శ్రీగర్వ నర్వంకషంబులగు నయనంబుల నిరీక్షించి నాకిట్లనియె.

ఉ॥ నీదగుమేని చిన్నములు నిక్కముగా బరికించి మాడ నీమేదిని నెల్లనేలఁదగిమేలగు రాకొలకుండు ... ట్టు ట న్మోదముగాఁగ దెల్పెదునమూల్య గుణాకర యిట్టివేళ నీవీదరికేల వచ్చితి సదీహిత మొప్పఁగ జెప్పుమంతయున్ ॥ ౨౦ ॥

వి. ఆహా యాబాలామణి వచనరచన చాతురీ పరిపాటి - మంచిది - నీవేమి పచించితివి.

రా. ఇట్లంటిని.

క॥ కార్య వశంబున నైనన। నార్యాహ్వానంబైన యన్నృతమాడ బెగడుదు నూర్యప్రిభవకుఁడనక। ధర్యమతి నైలితనీవ తక్కిన గుణముల్ ॥ ౨౧ ॥

ఉ॥ నేనిపుడైనఁ గొంత ధరణీవలయంబున సాజ్ఞ సిద్ధిచే। మానితుడైతి సర్వవిధ మంగళ రేఖల మొల్లసిల్లునీ। పాణిపలంబ నంబయిన చాటిగ నీయవనీ ప్రభుత్వమిం। తేనిఁ గొంతలేనటులఁ దెల్లమునుల్లము సంతసిల్లెడున్ ॥ ౨౨ ॥

మ॥ విదుషీ సంస్తుత శేముషీ మహిత నీవేత్తృత్వ మస్మాదృశావా దయాధా
యక శీల మాట మిగుల న్మాక్షంబుతో నర్థినై । మదకంగర్వ దరప్రహాణమున కైమన్నీడ
నైనంగళ । న్మదతం శేరితినింక జేయునది నన్మన్నింంబి చెప్పందగున్ ॥ ౨౩ ॥

వి. ఓయీనీవిట్లు వచింప నాబాలామణి యేమి వచించె.

రా. ఇట్లు వచించె.

క॥ విదితా శేషసుచరితుఁడ। వదితి సుతాధీశ సముఁడవగు నీ చేతన్ । ముదితాత్మ
గాఁగ జనకుల మదిగోరెద నేను విబుధ మానితచరితా ॥ ౨౪ ॥

క॥ వరవంశంబునఁ బుట్టిన వరవర్ణినులకు వన యము బాల్యమునందు। న్వరయోగ
దశను బరతయ వరమని పలియుంతురు గద వాగీశులిలన్ ॥ ౨౫ ॥

వి. ఆబాలామణి యుక్తి యుక్తంబుగ నిజానురాగంబు బహిర్నాపించుట మిగు
ల ధీరయుఁ గలావతియునై తోచు.

ఓవయస్యా మరియొకతెయైనం భవదీయ దర్శనమాత్రంబునదు ర్త స్వాంతయై
కంతువ్యథనంతంబు నొందింపంగోరి నిన్నే కాంతునిగ జేసికొనదా.

మంచిది కానిమ్ము- పిమ్మట నేమంటివి.

రా. ఇట్లంటి.

క॥ అనపేక్షిత గురుబాంధవ జనమలి సమనుగ్రహాను సరణమువిదితేం। ధనకు
శ వహ్ని పురోనస। మనధి గతామ్నాయ నియమితాచారమునన్ ॥ ౨౬ ॥

ఉ॥ శింజిత హృద్యమండన విశేష శుభాత్మక వాద్యహృద్యమున్। మంజుల
కాయమాన తతిమంజు మనోహరవేది హారియున్। మంజు నిరంధ్రి భిత్తికృత మానిత
చిత్రి మహాసమాజము । న్మంజుశరాగ్ని సాక్షికము గాత్రవిచిత్రి పవిత్రపా
త్రిమున్ ॥ ౨౭ ॥

క॥ అను గాంధర్వ వివాహము। మిగులుగ శోభావహంబు మీనాభిజ్ఞా।నగురుక
మప నీశులకుం దగునది కన్యాస్వతంత్ర తాపాదకమున్ ॥ ౨౮ ॥

కావున నిర్విఘ్నంబగు పరిణయంబున ననుంగరుణింపి విషమ సంహారణు వలన
శరణంబ వగుమని మిగుల వేడికొంటి। మఱియును.



మాలిని. సుచరిత పరిపాటీ శోభితంబౌఁగదున్న్నీ వచన మరయనైన న్వస్తుబు
ద్ధిం దలంపన్। అచలసుకృత శీల స్థాయి రాజన్య కన్యల్రుచిఁగలయరె గాంధర్వోపప
త్తిన్ననీతీ ॥ ౨౯ ॥

క॥ నేనీకర్హుడనైన న్మానై నదియాదియు నేనిమానకని పుడీ। సూనశరశరాళివ్య
థ మానవతీ విదిత వృత్తిమనుపుము నన్నున్ ॥ ౩౦ ॥

వి. బాగుబాగువయస్యా నిరుత్తరావకాశంబుగ వచించితివి- పిమ్మట నేమయ్యె

రా. ఆబాలామణి యేమియు వచింపక నవనలి వదనయైయుండె.

వి. ఆహా యీబాలామణి యెంత ధీర- కాకున్నను వనితలు ప్రగల్భలై నంద
మనమునను రాగంబు పరిచితులయందుం బ్రకాశింపఁ జేయరు- నీవవిదితుండవు-
ఇద్దియైనం గన్నియ కానసిద్దియు మిగులనాశ్చర్య కరంబుగాదు- మంచిది- దీనికొ
కవయస్య యున్నదని వచించితివిగదా- ఆపె యీసంభాషణం బంతయు నాలించి
యేరికి నేమియు వచింపలేదా.

రా॥ అప్పుడాపె యీబాలామణింగని యిట్లువచించె.

గీ॥ అర్హులగువారు నన్నిట నార్యవృత్తి। నాత్మరక్షణమునుగోరి నాత్మజేర। నా
త్మదానంబుచే నైన నరయువారి। మనుచుటయ కాదె ధర్మంబు మలిమతులకు ॥ ౩౧ ॥

క॥ గణనాతీత సుధీనుత। గుణగణ భూషణులు దన్ను గోరనవారి। న్గణియించి
కోర్కెతీర్ప ద్రుహిణు వరదుని జేసికొనుటయె గాదెయిలన్ ॥ ౩౨ ॥

వి. మేలు మేలు బాగుగ వచించెఁగదా యీవయస్యామణి- అందుకీ బాలామణి
యేమివక్కాణించె.

రా. ఏమివచింతు। అప్పటికిం బ్రతికూలంబుగాన వచించె.

వి. ఏమని.

రా. ఇట్లని.

క॥ ననుఁగని కడుఁ గనికరమున । మునిపన తలిదండ్రులకును మనుగుపరిచి
యాఁయనువున మేలొందుట నాకనయము నెడుతనము గాదె యలరుదురెపజల్ ॥ ౩౩ ॥

క॥ చెలినీయెఱుఁగని న్యాయంబులు లేవిలనైన నిట్లు ముగుదగు నాకుం। దెలిపెదవు దమ్మమనియో తెలివింబరికింపఁ దలచితెగ నాడెదవో ॥౩౪॥

వి. పిమ్మట.

రా. అను నాబాలామణికి నావయస్యా రత్నంబిట్లను- ఓచెలియా నీవిట్లంటివి యెంతమాటే నీవువంచనీయవా నేను వంచకురాలనా.

బా. కాదే యాళి యిట్టితలంపే నాకుఁబుట్టిన నిట్టేల పచింతునే- ముగుదను గావున నేమియుండోచక నట్లడిగితినే.

వయస్య॥ చెలిమిరో యట్లయిన వచించెద వినవే- రాజకన్యలకు గాంధర్వ పరిణయంబు విధిప్రణయుంబనియు కాదా తొల్లిఁకుముద్వతీ శకుంతలా వర్మదోలాచార్యదులు మాహాకులీనలు తత్తాదృశ గుణగణ మహార్ణవులగు మైథిలీను దుష్యంతపురుకుత్స ధనంజయాది క్షత్రియాన్వయోత్తముల గాంధర్వవివాహంబునం బరిగ్రహించి యిష్టభోగంబులనుభవించి సకలజన సమ్మాన్యతం బ్రశస్తికెక్కిరని నీవెఱుంగుదువా శేషా.

బాల. ఎఱుఁగుదును గాని ప్రాచీనాధునాతనంబులగు నాచారంబులకుం బెక్కులకు దేశకాలాది భేదంబువలన గ్రాహ్యాగ్రాహ్యతలు గలుగుటంజేసియు జనకవశన గుటయు నామనంబు సందేహగేహంబగుచున్నదే.

వయస్య. ఓచెలియా యీవియన్నియు దత్త్వోత్తరంబులు గావటే.

బా. చెలియా యిపుడేమి సేయవలయునే.

వి. నేవచింపునది యితరంబు లేదు - అని వారిరువురకు స్వసంకేత భాషచే సంభాషణంబయ్యె.

వి. లెస్స లెస్స - గుణనిరూపణ నిపుణయగు నావయస్యామణి సహాయంబున దాత్కాలికంబగు నీయభిలాషంబు ఫలిత ప్రాయంబగునని తలంచెద.

రా. ఇట్లుగాదే ఫలితంబయ్యెనని వచింపదగు.

వి. ఆహా నీవగదా ధన్యుండవు - ఇది యిటుండనిమ్ము - తదీయ సంకేత భాషనీవెట్లెఱింగితివి.



రా. తదీయవదనావలోకనావసరంబున వాణీవదనావలోకనావసరంబునంబోలె బుద్ధి ప్రతిభాత్మతనొందె కావున నాశబ్దంబులన్నియు మనంబునంగీలితంబులగుట ననంతరంబు తద్ధ్యాన ప్రసన్న మానస్కృతచేఁబరికింపఁ దదీయశబ్దావయవంబులగు వర్ణంబులే తదర్థప్రతిపాదకవిపర్యయంబులయ్యె - అక్కతంబున నెఱింగితి.

వి. అప్రతిమ ప్రతిభాభాసురుండవుగదా వయస్యా నీవు - మంచిది - పిమ్మటనేమయ్యె.

రా. అయ్యెడ నావయస్య యాబాలికం జూచి యోచెలియా యభినవారోపితంబగు మల్లీమతల్లిక నిన్న గోరకితంబయ్యె పుష్పితంబు గావలయుఁ జూచివచ్చెదఁ గాని నిపుణంబుగ నుండుమని యుపవనాంతరంబునకు వెడలె.

వి. ఆహా యాలలనామణి యెంతకలావతి - కృతకృత్యుండవైతివే - పదంపడియేమయ్యె.

రా. అయ్యెడ నాబాలామణి సందుగ్ధముగ్ధమందాక్షానురాగ రసాల సంబులకు నిరీక్షణంబుల వంతరంబునకే తెమ్మని పిలుచు దాని కరణంబలుమారుఁ జూచి వెడలి॥

సీ॥ ఈగదిలోనుండి యాగదిలోనికి నాగదిలోనుండి యావలిగది। కీశాలలోనుండి యాశాలలోనికి యాశాలలోనుండి యవలుండు ; శాలకు నతివిలాసాశ్రియ సంస్పృష్ట ఝుణఝుణత్కార సంజనిత హర్ష। మంజీర వశసాది మహితమండనముగ వెడలుచు నొక్కచో నడగియుండి। నాతాళ దడవుచు నాకు దన్నెఱుఁగించుటకు నూపురాంఘ్రి ఘట్టనము నిడుచు। నాజాడఁ జేసే వదయన మెఱింగియ వెంటనంటినఁ గొంటెయై తొంటి చోప్ప। మరి మరి దిరుగుచు మురిపెమ్ములీనుచు నాసౌధభూమికాహారి విశ్రమ। లన్నియుఁ జూడఁగన నవకాశమిచ్చుచు నొక్కొక్కచోటను జక్కనైన ; మెఱుపు తీవియకరణిని మెఱసి మెఱసి మల్లగుల్లాలఁబెట్టుచు మరిమరలుచు। కలికచికేళి మందిర లలితదత్త। హీరభరముపరి భూమిక యువవు సేరె॥ ౩౫ ॥

వి. పిమ్మట నేమయ్యె.

రా. క॥ స్వస్తికమునఁగుచమండలి హస్తగలాంగులిక పోల హసితాధరముల్। శస్త్రలలితములఁ గప్పుచు నుస్తనియది మోము సేర్చి సురుచిరశయ్యన్ ॥ ౩౬ ॥

క్రింద నిలువంబడియుండె.

వి. ఓవయస్యా యాశయ్య వర్ణింపుమీ.

రా. ఓవయస్యా నావివక్షావిషయంబగు నర్థంబీవ యనుయోగించితివి- బాగు బాగు - వినిపెద నాలింపుము - అనుచు సోత్సాహంబుగ.

న॥ అభినవ పర్ణిపర్ణమ సృణారుణ విద్రుమ కాండక్ల్ప్త వల్లభ పురవ ప్రమాణ రుచిరాంఘ్రియు నంతర సక్తపంస్కార । తృ్రిభమణి ఖండ మండిత సువర్ణమయోజ్జ్వల చిత్రపాత్రికా సుభగమహోజ్జ్వదండ భృతి శోభిత మంజుల శాయమాన ముౕ ॥ ౩౭ ॥

చ॥ స్ఫుట తమ శక్ర గోపగణ శోణ తృణీకవణత్కమప్రభా పటల దృగుత్స వ ప్రభవభావుక పట్టకుణౌఘచిత్రిసం। ఘటనసుమూప మంజిమవికస్వరమాలతి జాలీల సత్పట కృశబంధుగాత్మ పరిబర్హ మహామహాత మోపబర్హముౕ ॥ ౩౮

చ॥ సువిమలవర్తులోయతర శుక్తిమణీగణ క్ల్ప్తరఝల్లరీ కవచిత కోటిలోచన విశాస విభూతిద శాయమానమ । ద్యుతితత దృబ్ధముగ్ధకనదంబుజ రత్న విహంగపాలికా నివహమహావితాన పరిణీత మహాద్భుత రాగురూపముౕ ॥ ౩౯ ॥

చ॥ శరదసదాత పక్షగిరి శపరిభువాసర నిర్ణిరోద భాస్వర శిశిరాంశు బింబవిల శశ్ఛశగర్భ శిరోమజాల ని । స్ఫురపరతూల సంభరిత సూనసముత్కర పేశలోపధాన రచిత చిత్ర శిక్షతల నద్ధల సత్ఫలకాభిరామముౕ ॥ ౪౦ ॥

చ॥ సురుచిర గౌరహీర మణి సుందర కేసర వారపూరితాంతర పగచంద్రకాంత కలితచ్ఛద బంధురకైరవోత్కర । స్ఫురణసముల్బణాభ్యుదిత శుభ్రిమ యూఖమయూఖరాచిషీ భరిత గృహాంతరాళ పరిభర్త్సిత దీపక కాయమానముౕ ॥ ౪౧

క॥ నిగ నిగ మెఱుగుల మెలగెడు। తగురతనముల చిదురుపలదనరు కరణులం । తెగివెచ్చు పైడి పలకల మిగులగవలరారు వెడవమెట్లులనొలిౕ ॥ ౪౨ ॥

శరత్సనద్భిరు,



వి. వయస్యా యిట్టిదైన దాని వైభవంబునకు గొఱంత సీవర్ణనాకౌశలంబునకు గొఱంత - కానిమ్ము పిమ్మట నేమయ్యె.

చ॥ మదనుడు దానితోఁ గలప మక్కువతోవను మాటిమాటికిం। బదనగు నమ్ములంబరపి బాధలు సేయుచునున్న ధైర్యము । నవ్వదలక మూక భావమున వర్తిలజేయుచు బత్ర్కమంబులౕ। సుదతిని వెక్కఁజేరి మృదు శోభినఖంబులఁబ్రిక్కలంటితౕ ॥ ౪౩ ॥

వి. పిమ్మట నేమయ్యె.

రా. గీ॥ దానవంచిత కిలికించిత ప్రతీక। యగుచుఁ దొందరఁ జెందివియాతళగణి । నెదురుగను భుజవల్లుల నీరు బారు। నాదు గళమునఁదగిలించె నాతియపుడు॥ ౪౪ ॥

వి. ఆహా వయస్యా నీభాగ్యంబేమని పచియింతు బ్రిహ్మానందస బ్రహ్మచారియగు తాదృశ బాలామణీ స్వయంగ్రిహణ సుఖంబనుభవించితివి. పిమ్మట

రా. మ॥ అపురాబాలిక చేష్టితంబులు విసారాంతర్ప్రాయంత్రిణా వ్యప పూర్వోత్తర సంధులౌట రసిక స్వాంతానుభూతిక్రమై । కపగిజ్ఞేయ రసోల్బణంబులు ప్రిదుగ్ధానంద సందోహముల్విపులశ్రీసూక్ష్మతైక లభ్యములునై వెల్గొందె నత్యంతముౕ ॥ ౪౫ ॥

గీ॥ ఇవ్విధంబున నభిమత హేల లలర నలరు విల్తుని సేవలు సలుపుచుండ॥ బ్రిమద సంగతకోక దంపతిరుతముల బలయువై తాళికస్తుతి పాఠమమరె ॥ ౪౬ ॥

క॥ ఆయెడ మేల్కని కన్నులు। పాయంబున దేవి చూడ బమ్మగప్పి మనం । బాయొలనాగను గానమి నీయానదురంత చింత నియమితమయ్యెౕ ॥ ౪౭ ॥

క॥ ఏదెసఁజూచిన నదియే మోదమిడుచుఁ గానఁ బడెడు ముద్దులుగులుకౕ । ఏది వినబడినఁ దన్మృదు। పాదాంగడ శింజతముల భావముబగులుౕ ॥ ౪౮ ॥

గీ॥ కాని తాకంగఁ బోవఁగ గలికి యప్పుడు। మాయమైపోవు కానుపుమంబు

లంజేరి! కన్నుమూసిన వెంటన కానఁబడుచు। నన్ను గనుఁగొంటివే యని నగుమొఁబలుకున్॥
౪౯ ॥

క॥ అపరిచితుండవగుటచే। నెపమిడి నేనపుడు నీకు నెయ్యము మీఱఁ। యఘునము దాచితి యొయ్యెడ నపశంకత నొసగితి ననయము జేకొమ్మా ॥ ౫౦ ॥

గీ॥ మరియు నాకేళి వేళల జరిగినట్టి మాటలను దాహరించి యామానమదర నుల్లసంబులనాడుచుఁ బల్లవించు ప్రేమననయంబు ననుదూరుఁ బేరువాడి ॥ ౫౧ ॥

క॥ ఇది కలయని యెట్లెన్నుదు। నది జాగ్రద్దశలఁ జేర ననుభవపథము। స్మృతియని యెటుల నుడువుదు విదితములెల్లను మెలంగు విశ్రత స్ఫురణన్ ॥ ౫౨ ॥

వి. వయస్యా యయ్యవసరంబున నబ్బాలామణి ధరించిన వసనంబెట్టి దాఁ గలదై కానుపించె.

రా॥ విను వచించెద.

క॥ సురభి పయఃఫేనచ్ఛవి భరితంబైనను దగీయు భవ్యనవపుష్పశ్రీ। ధరపరిష్కృతమై మెప్పొంగును మెఱుఁగులగుముల మిగుల ఘటియించునదై ॥ ౫౩ ॥

వి. వయస్య విశిష్ట ప్రియద వన మహోపకరణ మహనీయ సౌధతాన్యత బాలామణీవిలోకనాదికంబులు స్వప్నశాస్త్రంబున నభీష్ట కల్యాణ ఫలప్రదంబులని విహితంబులగుట వీనిలో నొక్కొక్కటియు నుట్టిదగులకుఁ దద్దయు సమర్థంబు - అట్లుండ నన్నియు నీకనుభవ విషయంబులగుటం దదవసరంబు ప్రభాతప్రాయంబగుటను నీకు వేగంబ సత్త్వమాభీష్టంబులు లభించు.

రా. సప్రమోద వికాసంబుగ - సత్యమస్తు వచస్తవయని నా రెపారెనునుడివి ఓవయస్యా నాయభీష్టం బాకన్యారత్న లాభంబుకంటెఁ దక్కినదెద్ది - అద్దిలభించిన స్వర్గరాజ్యంబైన నభిలషింపను.

వి. వయస్యా నీవణిమాత్రంబు సంఖ్యావత్సంఖ్యాత వైదుష్యుండవుగదా- స్వప్నదృష్టంబైన యర్థంబు జాగ్రద్వ్యవహారంబున ననుభవింపుట కభిలషించుట సమంజసంబే నా.



రా. కాదు వయస్యా నీవెఱుంగుదు - ఐనను మనోవృత్తి తాదృశంబయ్యె। అట్లైన వివేకధారవాఙ్భ్రాంతి పంకంబవగునుము మనంబునకు ప్రసాదంబు సంపాదింపుము. గాలయాపనంబునకై యొక్కగుండెన మృగయావ్యాజంబునఁ దురంగము బాళోహించి ప్రకరాన్త కాంతారంబునకుం జనవయ్యాది యాత్రీయ రయాతిశయు ఖంజీకృతకురంగ తురంగంబై ఏకసంగతంబుగాక ముహూర్తమాత్రంబున నతి దవీయంబగు వనమునంబతిక్రమించి యవిదితంబగు నొక్క యారణ్యానీగర్భంబున నిలిచె

వి. ఆహా బహుళంబగు కష్టంబనిష్టతమం బాదిష్టంబున బ్రాప్తంబయ్యెఁగాఁ బోలు.

రా. ఇదివరకు నట్లకానంబడుచున్నది.

వి. అయ్యోపాపమైన బడలిక యొకటి రెండు దినంబులం బథ్యాహారాది విశేషణంబులఁ గుందవచ్చునే.

రా. ఈయాయాసం బట్టిదనుకొంటివా - కాదు - అక్కడ గొంత కర్జంబు జరిగె నద్ది వచించెద నాలింపుమని యాహరిణావృత హరిణేక్షణల సాక్షాత్కార శ్రవణంబు దొలుతగ జరిగిన వృత్తాంతంబంతయు సవిస్తరంబుగఁ దెలుపుచున్నాడు.

వి. స్వ. ఆహా యెంత యాశ్చర్యము - ఆ పేటికాంతరస్థిత కన్యారత్నద్వయంబ కాఁబోలు కుంభస్తనిచేఁ దెలుపంబడినది - దైవంబీతని కాబాలామణి సంఘటింపనిట్లొనరించెఁ గాఁబోలు - కావున్న నిట్లు తటస్థించుఁ గా అని స్వప్నశాస్త్రరాద్ధాంత ప్రకారంబున నాడీ పరీక్షణంబొనరించి యాకన్యామణి నితండు పరిణయింపం గలవాడేయని తలంచి.

ప్ర. ఓయి వయస్యా దురాత్ముండను నాయసుర సమ్ముఖంబి యార్జన శ్రీగణంబున ధన్యాత్ముండవైతివి - నారును పిశిమనోరథ విధంబున పరిణయింపఁ గలరు ఇయ్యెడ నీకు విషాదాతిశయంబున కెద్ది నిదానంబు.

రా. కలగేనిదానంబుత్తమంబు.

వి. అద్ది కథనీయుం బీసా.

రా. నీకు గోపనీయంబు గలదా.

వి. ఐన దాన నాపీనులనిండింపుము.

రా. ఆకర్ణ్యాదృశ్యంబు స్వప్నంబున నాచే జూడఁబడినదయని తద్వపు ర్వ్యాపారాది నిరీక్షణంబునం దదీయ స్వరంబునం దదుక్తి వైఖరీ విశేషంబునను నిక్కంబు గఁ దోఁచుచున్నది.

వి. ఈయుదంతంబు నితాంతం బద్భుత రసాంతంబై యుండె - అమంగళం బు వసుంధరయందుఁ బ్రవేశింపఁదగు - అట్లైన దాని సంగతిం బరికింతము - విషా దంబు వీడి యజ్ఞనాది కార్యంబులు పరిశీలించుచుండుము - అని దారంపు దెస గనుఁ గొని - ఓయెవ్వండక్కడ - ప్రతిహారి ప్రవేశించుచున్నాడు.

ప్రతి. ఓసుబ్రాహ్మణ మణీ నీయనుశాసనీయంబనుశాసింపు నీజనుండు నిగు వేడుక పడుచున్నాడు.

వి. చెంతకుంజని వానికర్ణమూలంబున నిట్లని జపించుచున్నాడు.

ప్రతి. భవదనుశాసనంబతి మహనీయంబని యట్లొనరించుచున్నాడు.

వి. వెండియు నంతరంబునకుం జేరి - ఓవయస్యా యియ్యెడ నొక్క మంత నంబొనరించితి - దేవి యేతెంచుఁగాని నీవియ్యెడ బోడమిన బడలిక గదు నిబ్బడి గా నభినయించుచుండుము - మరియు నత్తటి జరుగు చెయువులన్నిటికి విరక్షత వీడి యేమియు ననుయోగింపక నానుకూల్యంబుచే నుండు.

రా. సోద్వేగంబుగ - ఓరీ ఛాందసుఁడా యెంత పని సేసితివి.

వి. నే నేమి సేసితి.

రా. అనిష్టంబు.

వి. ఇది యనిష్టంబేలా.

రా. దీనికంటె మతి యెక్కుండగు నద్దియెద్ది.



వి. ఎందునుండి.

రా. అద్దినీ వెఱుంగవు గాఁబోలు - కానిమ్ము వచించెద వినుము - దేవి పూర్వ మంచే నాయందన్యాసక్తత శంకించుచుఁ బ్రసక్తిమాలియుఁ జిడుముడిలిడుచుండు ఏ తాదృశంబులగు నిదానింతన వికారంబుల నాలోకించెనేని మిగులం గుపితయగు - ఇ ట్లగునవే కాదా యీమాయవ్యాజంబున నేరక నలక్షితుండనై యిట్లంటి.

వి. వయస్య యట్లగునని కాతరత నొందకు - దేవి నీయందతి మాత్రింబనుకం పాసంపాదత సౌహార్దస్వాంతయగు నటుల నొనరించెద.

రా. ఆహా కష్టము - నీకుఁ దోచినంత సేయువాఁడవు గాని పౌర్వాపర్య విచారపరుండవు గావు - మదీయ భాగధేయవశంబునఁ గాఁగల కార్యంబులు నెరవేరఁ గలవు - కావున నీయిష్టప్రకారంబున వర్తింపుము.

వి. మంచిది. యీభారంబంతయు నాకొందుకు - నీవూరక చూచుచుండుము - క ర్తవ్యార్థంబంతయు మన కిరువురకు లాభకరంబుగ సంఘటించెద.

రా. ఇయ్యెడ నీకేమి లాభంబు సంపాదించు కొనందలంచితివి.

వి. తినంబోవుచు రుచులడుగనేల - చూచుచుండుము.

రా. ఇట్టి యవసరమందును స్వకార్య తత్పరతయేనా.

వి. స్వయంతీర్ణః పరాంస్తారయతి యనునార్యోక్తి భవదీయ శ్రవణ నిలయంబు గాలేదా.

రా. సహర్షమోదంబుగ - వయస్య యాత్మసాదృశ్యంబున నన్ను నభిమతార్థ సంగతు నొనరింపుము.

వి. అంగుళేమి సందియంబు - నేను వచించిన కరణింగను కని నివసింపుము.

రా. అటుల సలిపెదనని యాతనితో నిష్ప్రాలాపంబు లొనరించుచున్నాఁడు.

పిమ్మటం బ్రవేశించుచున్నది భర్తృపీడాకర్షితాత్మయగు దేవియు సఖియు.

సఖి. ఏమే వయస్యా దివాతప శశికల కరణి మిగుల శోభనీయాత్మవై చూపట్టుదువు.

దే. సవిషాదంబుగ- సఖి యీసమయంబున సమయింపనలవిపడని కడగండ్లకుం బాల్పడితిగదా.

స. ఎప్పాంటెనంటివే చెలియా యిట్టు.

దే. ఆర్య పుత్రువికసంబెక్కు దినంబులం బొడమిన యవస్థ రోయుంగవే.

స. చెలి యిదివరకు నక్లైయున్నదా.

దే. అట్లున్న నేమంబేకాదా.

స. నేను విశదంబుగ నెఱుంగంగాని యది యట్టిదో వచింపుమీ.

దే. ఔను ఈనడుమ మనము గలియమింజేసి యిచ్చటి సుద్ది నీకొక్కింతయు విదితంబు గాకుండు - కావున వినిచెద నాలింపుము - ఆర్యపుత్రుండు లోంగడంగింకం జిక్కియుండుట నీవెఱుంగుదువు గదా - అట్లుండియును నడుమ నొక్కనాడొక్కరుండ ప్రొద్దు వుచ్చుట కని సంజకుఞ్జాముండమావు నెక్కి వేట పొంటెంబేరడవి కింజనెనట - అరేయి రెండవ జాము గొంత జరుగం దిరిగి యేతెంచెనట - పిమ్మటం బరిచారకులెరును సెలవు నొందక నా చెంతకు రావలువదని యానతి సేసెనట - మరియు నొక్కరుండ యాయుద్యాన సౌధంబున నివసించెనట - ఈయుదంతంబు మరునాడుదయ సమయంబున నేవిని యాతని చెంతకుం జేరి చూడం దగ్గయు వివశుండైయుండె. మరియు.

చ॥ అపరిమితావనీశ మకుటాంతర హీరరుచారు శాసనుం। డుపచితదర్ప విద్విషది భోత్కర ధైర్యభిదామృగేంద్రరా। వపటిమ చాపటంకృతియు వాక్పతి మస్త్రకతారలీవిధా। నపటుమనీషుండైన పతి బాకు వశుండయియుండు నర్మిలిన్ ॥ ౫౮ ॥

గీ॥ అట్టినాండయ్యు వర్ణని యపుడు పగతుం జూచుకగణినిం బెడమోము సొలపు మీఱం। జేసెనేనిది యేమని వాసిందొలంగి యడుగం బొడుగున సరిగాంగ వనియె [illegible] ॥ ౫౯ ॥



క॥ ఓరాజపుత్రిని న్గన। నారాటము డెందమునకు నభివృద్ధమగుకా। నీరాకనే వచించెద। మారాడక మఱలి పొమ్ము మఱి యాడుగకుమీ ॥ ౬౦ ॥

అని యుత్తరీయంబున నోడలెల్ల సిండంగప్పుకొని కన్నుండెనని బాష్పంబులు విడుచుచున్నది.

సఖి. సాశ్చర్య ఖేదంబుగ, ఓచెలియా యెంతమాట వృస్తైనే. ఇద్ది పరికింప జాబిల్లి బిల్లి వలనం బిడుగువాడమటయుం గన్నిపూలోనుండి యుల్క వెడలుటయుం గ్షీరోధంబు వలనం గాలకూటం బావిర్భవించుటయు నవనీత పిండంబువలన విస్ఫులింగోత్కరంబుదయించుటయు సాధుజనాననంబు వలనం బరాపకారైకార్థంబగు భాషణంబు వెలువడుటయునై కన్పట్టు. సమయ వశతంబొడమునవస్థా విశేషంబులనుభవంబు వీడి యేరికి నిరూపింప నలవడవు. నైపుము. వడంపడి యేమయ్యె.

దేవి. సఖి యప్పుడు నామనం బతిమాత్రంబు క్రోధానమాన విషాద నిర్దగ్ధంబగుట నెట్టిదశనొందెనో వచింపంజాల. అట్టి దాననై వెంటన యేతెంచి కొంతతడికిం దాలిమిం దెచ్చికొని బ్రతికియుండిన శుభములంబడయవచ్చు ననునయంబు జీవంబున కాధారంబు సేసికొని యవధారితప్రాణ పరిత్యాగోద్యమంబునం దొలంగితిని.

సఖి. సాశ్చర్యవిషాదంబుగ. హాయెంతపనివృట్టె. సఖి తొలుతం దత్త్రరపాటున నమచిత వికార పరవశవయ్యును బదంపడి సూహామహాసయమనీషవైతివి. అయ్యెడ నీకు "సహసావిదధీతనక్రియామవివేకః పరమాపదాంపదం - వృణతేహివిమృశ్యకారిణంగుణలుబ్ధాస్స్వయమేవసంపదః" యను కిరాతార్జునీయ పద్యంబుపస్థితంబయ్యెనని తలంచెద.

దేవి. సఖి యౌను.

సఖి. చెలి యుట్లగుటంజేసి వెసంగ సకల సౌభాగ్యసంపదలకు జననికేతనంబగుదువు.

దేవి. చెలియ యిదివరకైతే యట్టి తలంపు విలసిల్లుగాని యధునాతన స్థితి వితర్కింపం బోచకున్నదే.

సఖి. అది యెట్లు.

దేవి. పెక్కువాసరంబులనుండి స్నానపాన భోజనాది కృత్యంబుల నొక్కింతయైన వర్తనంబు దలపక నైదాఘునిమ్న గౌఘంబు చాడ్పున నతికృశుండై యార్యపుత్రుండుండ నాశుభాభిలాషం బెట్టుఫలించునని తలంతు.

సఖి. కిముదవసరంబు చింతించి. ఓచెలీ యిద్ది భూతావేశమూలకంబేమో యని తోచుచున్నదే.

దేవి. సాశంకంబుగ. వయస్యా యార్యపుత్రునకు నద్ది గలుగునే.

సఖి. ఆయనకుం బురాతన మహిమంబునం జేసి యిది యనధ్యాహార్యంబే కాని యిప్పుడు నూహనీయంబుగా వచ్చు. అది యెట్లంటివేని విను. గ్రహంబులు దారుణంబులగు నరణ్యంబుల శరణంబులం జేసికొనియుండుననియు దుర్బలులగువారు దారసిల్లిన వారి నావేశించి బహు భంగుల బాధించుననియు జనశ్రుతి సంగతంబగు. కావున నీ వయస్యుండును లోంగడం గింకనతి ఖిన్నుండైయుండి యచ్చటి కేగెం గావున నవ్వి సోంకియుయుండందగు. కావున భవదేకప్రాణుండగు నీతండు నీయెడ నిట్టి విగసవర్తనంబు సలుపునా.

దేవి. సఖ నీకు నిట్లు తోచుచున్నదా.

సఖి. ఔను - ఇది యటుండనిమ్ము - పెంటలకేరికైనా నిట్టి వితర్కంబు గలిగెనా.

దేవి. ఇంతకుమున్ను మాకెవ్వారికియు నిట్టి యూహ యుదితంబుగా లేదు గాని సుబ్రహ్మణుం డార్యపుత్రప్రియవయస్యుండగు విదూషకుండతకు లోంగడనే యాయనంగని యేమి పరికించియోగాని గ్రహబలిసాధనంబులగు పదార్థంబుల నహర్జనంబుచేం దారిపించికొనియే తేరవలయునని వార్తనంపె.

అట్లైన నద్దియు నిక్కంబగు.

దేవి. పదీయ వచన విశ్వాసంబున నేను నట్ల సలుప నుద్యోగించితిని.



సఖి. అట్లైన దడవు వీడి వేసంగ నట్లొనరింపుము. నేనును వెండియు నీతెం పెడునని నిర్గమించుచున్నది జేనియుం దాత్కాలిక కృత్య నిర్వహణంబుకై యుద్యోగించుచున్నది.

పిమ్మటం బ్రవేశించుచున్నది. ప్రాణనాథ సౌధంబున జన సంవాహితత్రినయన ఘలపరిష్కృతా మహాస్వాద ద్వాత్రింశల్లడ్డుక మహారజత పాత్రియుం దాదృశపాక పాటల గోక్షీర భరిత కనక కలశయుం బరిమిత పరిచారికానుగతయు దేవి.

వి. ఈషద్దూరంబున దేవిం గాంచి- రాజాంబాచేంటివయస్యా దేవియే తెంచుచున్నది గాని వివశుండవు గాక వైరస్యంబభినయించుచు దేవితో నేవచించు వచనంబులకనుకూలంబుగ నప్రమత్తుండవై ప్రవర్తింపుమని దేవి కభిముఖంబుగ.

దే. సుబ్రహ్మణ యాజనము ప్రణమిల్లుచున్నది.

వి. దేవి సమగ్ర సౌభాగ్య సాధ్వీమతల్లిక యగుత.

దే. సుబ్రహ్మణ భవదాగమంబునం జేసి యియ్యెడ నిచ్చటికి రాంగలిగె.

వి. దేవి యిట్లు వచింపనేల యంతరమ్మునకే తెమ్ము.

దే. అందుకుం దొల్లింటి యార్యపుత్రుండు గాడు గావున నేనొల్ల.

వి. దేవి యవశంబునం బొడము దోషంబు లెన్నుట మహితమతుల కుచితంబే నా.

దే. (స్వ) ఆర్యపుత్రునకట్టి వికారము వొడమ నొక్క కారణంబుం గాపలయు - (ప్ర) సమనాగమర్షంబుగ - అవశతకెద్ది నిదానంబు.

వి. ఇయ్యెడ నేవచింపం జాలను గాని నేనుడివ్విన చొప్పు చేసితివేని యప్పుడాలోచించి వచించెద.

దే. ఇపుడేమి సేయవలయు.

వి. ఈపదార్థంబులతోం గూడం బలిచెంత కేతేరవలయు.

దే. ఆర్య పుత్రుండు మిగులనలుగడుగదా.

వి. ఇట్టి సంభాషణంబుల కద్ది యవసరంబే.

దే. పరిభవంబు విషాద ప్రభవంబుకదా.

వి. తత్కార్తచిత్తవృత్తివికృతిం జెందకుండిన.

దే. అట్లైన నీయిష్టంబు చొప్పున వర్తిల్లెదనని యంబరతోడం గూడి బలి సమీపంబున కేతెంచుచున్నది.

వి. దేవి ఈవస్తువుల నిక్కడ నివసింపం జేయందగు.

దే. అట్లాజ్ఞాపించుచున్నది.

వి. దేవి వయస్యుండెట్లుండెనో చూచితివా.

దే. కాంచి చింతాకులిత స్వాంతయగుచు నాహా యార్యపుత్రుండు.

కం॥ గృహపాళీ దాహకహుత । వహమహదాభీలకీల వాతాటోప । ప్రహత మగును పవనాంతర । విహితకురసకదళి తరువు విధముననుండెన్॥ ౫౭॥

ఉ॥ కాంచి జలంబులందిడిన కాంచనవల్లికవోలె వెల్లనై । నీచరుచిన్ వహించు మెయి నిద్రితరుల్ వలె భద్రలీలలన్ । దోచవుకన్ను లూర్పులతిదూరములై కడు వెచ్చనెచ్చఁగా । వీచెడు నీతడిప్డు వెతవెల్లుల పాలయియుండు నయ్యయో॥ ౫౮॥

మఱియు.

చ॥ దినకరదీప్తి సంవరణ దీనసుధాకర మూర్తిపోలు నీ । తనితగుమాపు తద్దయు మదావళశీకవికీర్ణ నీరస ద్వరుహశోచనీయమగు వక్త్రము గాత్రము లెల్ల నాహహా । శనగతిఁదాంత పల్లవదశావశతంగను నిప్పుడక్కటా॥ ౫౯॥

అనుచుం బరిదేవించు చున్నది.

వి. దేవి యీపీఠంబునం దుపవేశింపుము. ఈబలివస్తు పాత్రంబిచ్చుట నంపించుము.

దేవి. (యట్లొనరించి) యోయి సుబ్రాహ్మణా చూచితివిగదా నీవయస్యునవస్థ పొడమిన యవస్థ.



వి. దేవీ యౌను. కాలవశంబున నెట్టివారికి నెట్టికష్టంబులు నేతెంచుట విదితంబకదా.

దే. ఈరాజిట్లు కృశించుటకే నిదానంబసిత పక్షాయితం బయ్యెనో నేం బరికింపం జాల నీవు సుబ్రాహ్మణుండవగుట శక్తుండ వగుదువని తలంచెద.

వి. దేవీ యిటువంటివాని కారణంబులు నిరూపింప నేనును మిగుల నెరవరిని గాను. అయిన నా తెలివి బలిమికొలంది వితర్కింపనది గ్రహావేశ మూలంబని తోచుచున్నది. అందుకుం గతంబును భిన్నుండై యాగణ్యానిం బ్రవేశించుట గావచ్చు.

దే. దీని నిక్కంబెట్టు విస్పష్టంబగు.

వి. అద్ది పరీక్షించుటకయే కాదా నీకట్లు వార్తనంపితిని.

దే. నీవు వచించిన వస్తువులన్నియు నానీతంబులయ్యె నిపుడేమి కర్తవ్యంబు.

వి. దేవీ యీపదార్థంబులన్నియు నీతని మోముచెంతకుం జేర్చి యోగ్రహవరమాయాగ్రహంబువీడి యిపుడీయర్థంబు లాస్వాదించి యీయనకుం గుశలంబు సంపాదింపుమని ప్రార్థించి కొంత తడి యట్లుంచి పదంపడి యొక్క దుర్గల విప్రునకు యత్కించిద్దక్షిణా సమేతంబుగా దానంబొసంగుము. అట్లగునం బిమ్మట దాని గుణాగుణంబులు గొంతవట్టుకుం దెలియందగు.

రా. స్వ. ఆహా యీతండెంత గడుసు చాపలంబున లడ్డుకంబుల భక్షింపం గోరి మదీయంబు మదన నిదానంబగు వ్యాధికి గ్రహావేశ మూలకతం గల్పించుచున్నాండనుచు వికసితాధరుండగుచున్నాఁడు

వి. దేవీ చూచితివా వయస్యుని వదనంబు మన మీబల్యర్పణవిధిం దలపంగా సంత వికసితంబగుచున్నది. కావున సత్వరంబుగ బలివర్పింపుము.

దే. అట్లొనరించుచున్నది.

రా. తదీయ కైతవ ప్రమాదాకలన నిదాన హాసనంబు నపహ్నవింపంజాలక ము ... [illegible] ...చున్నాఁడు.

వి. దేవీ కనుంగొనుము. ఈయెడ వయస్యుని యాననంబు దొల్లింటికంటె వికాస విశదంబగుచున్నది. కావున గ్రహంబీయెడ నీతనిం గొంతవట్టువీడె బలిద్రవ్యం బావహించి యాస్వాదించుచున్నదని తోచెడి. ఇద్దియ నిక్కంబుగావచ్చు.

దే. సుబ్రాహ్మణా యిదికామినీ గ్రహంబు గావలయు. కాకున్న సాక్షా యాత్రోవిజితపుం గ్రహాధీశ్వరుండైన యార్యపుత్రుని బరగ్రహంబు లెట్లు బాధింప శక్తంబులగు.

వి. దేవీ మానంబ భవదీయ వ్యాహారంబు మానంబని యెంచెదను. అదియును మున్ను మున్ను విస్పష్టంబుగాఁగలదు.

రా. స్వ. సభయంబుగ ఆహా కష్టము కష్టము. ఈమూఢుఁడు దొలుత నాకెఱుంగింపకయుదేవి రాపించె. ఆపె నగ్గాంచి యావికృతి కామినీ గ్రహావిదావంబని యట్లో వితర్కించి వచించుచున్నది. ఇంక మిగుల వధిక్షేపింపక మానడు. కావున నిత్యశంకితయగు దేవి యల వంజరీభవభీతుండనగు నాయెడల దీని యుద్యమంబు వ్రణవ్యధార్తునకుఁ గటుశలాటుపంక లేపంబగుచున్నది అనుచు సదైన్య క్రోధంబుగ విలోకించుచున్నాఁడు.

వి. విదిత తదభిప్రాయుండగుచు - ఓ గ్రహరాజమానీ నిక్కంబు బయలు వడునని చింతింపకు - ఈజీవి చాలదనియు విచారింపకు నీయిష్టం బొడఁగూర్చెదము - అని గేలింగాంచి - ఓదేవీ వయస్యుం డనామయుండయ్యె నేని మనమేమి సేంతు నెయ్యది గొఱంత.

దే సుబ్రాహ్మణ మన సౌభాగ్యంబంతయు నార్యపుత్ర మూలకంబకదా - సంతోషంబున నట్లొనరింతము.

రా. వికసితముఖుం డగుచున్నాఁడు.

వి. దేవీ వయస్యుం డీయెడను దొల్లింటికంటె బ్రసన్నుండయ్యెండునని నే నెంచెద. నీకేమి తోచుచున్నది.



వి. దేవి యట్లైన నార్యపుత్రు సెజ్జం జెంది కుశలం బనుయోగింపుము అనుకూలంబులగు నుత్తరంబు లొసంగెనేని మీద నాలోచింతము.

దే. మంచిదని యాతనితల్పంబునం దుపవేశించుచున్నది.

రా. దీనస్వరంబున దేవీ కంతకురమ్ము తావకీనకర సరసిజ స్పర్శనంబునం బగుటచేతం జూచితివా నామేనెట్లున్నదోయని యశ్రూద్గారం బొనరించుచున్నాఁడు.

దే. సవిశేషంబగు విషాదంబునం గలుషిత మనీషయగుచు హా యార్యపుత్రా నీకిట్టి కష్టంబు గ్రహమూలంబై యేతెంచినని తెలియలేక యవివేకంబునఁ జాపలమూలకంబని తలంచి మహాపరాధినైతినిగదా.

రా. దేవీ నాయభాగ్యంబునకు నీవేమి సేసెదవు.

దే. ఆర్యపుత్ర యీయభాగ్యంబునకుం బ్రధానస్వామిత్వంబు మదధీనంబ - అని యతి యత్నసంస్తంభిత బాష్పయగుచుఁ దనపాణి పల్లవంబున నతని మేనంటం దుడుకుచున్నది.

వి. వయస్యా యీనడుమ నుపవాసంబుల మిగులం డస్సియుంటివి - ఇప్పుడు బుభుక్ష యేమైనం గలదా.

రా. సనిశ్వాసంబుగ. ఇదివరకైతే యామాట శ్రుతిపుటంబులకుఁ దప్తసీసరసత నిచ్చెడిదిగాని యిపుడట్లుండలేదు.

వి. దేవీ గ్రహంబీషత్తప్తంబగునని తోచెడి - దాని సంగతి యంతయుఁ బదంపడి పరికింతము నీవు వేళంబ వయస్యునకు నిష్టంబులగు పాకంబుల సలిపించి యథేష్టంబుగ భోజనం బిడుము.

దే. సనిశ్వాసంబుగ ఆహా యెన్ని దినంబుల కీభాగ్యంబునకుఁ బాత్రం బయితిని - కాని యింకొకమాట ఇద్ది నీవే తెంచుటచే నిపుడు నాకు లభ్యంబయ్యె మొదటినుండి నీవియ్యెడనుండిన నింత కష్టంబు వాటింపక పోవును.

వి. దేవీ గతంబునకుం బరితపించుటయు భావికిం బరిశీలింప మియుమూఢ ల

దే. ఇంతకంటెఁ బెరకర్జం బెయ్యది - ఇది యెంతసేపు ఇదిగో యరుగ్యోనని స్వానుగత జనసమేతయగుచు నిర్గమించుచున్నది.

రా. వయస్యా దేవి సపరివారయాయి దూరంబుగ వెడలెగా.

వి. చాల దవ్వటిగె.

రా. ఓరి శఠుఁడా యెంతకార్యం బొనరించితివి.

వి. సహసంబుగ నేనేమిసేసితిని.

రా. నీవెఱుంగవా యింతకంటెఁ గర్తవ్యం బెద్ది.

వి. నీకు దయ్యంబు సోకెనని బలిచ్ఛలంబున లడ్డుకాదులం దెప్పించుట.

రా. కాదా.

వి. మఱియేమి సేయుమన్నావు - నిన్నఁ బ్రొద్దువనఁగా పత్రిసరన్నము దిని బయలుదేరి రాత్రివేళ నిద్రలేక నెనిమిదామడలు నడిచి నడిచి ప్రొద్దు పొడుచుట పరకు వచ్చితిమి. ఎంత యాయాసము గలిగియున్నదని చెప్పుదు - ఒకమూల నాకలియు నొకమూల నీ యవస్థయు నొక్కమాటే బాధింపం దొణంగె - కావున నట్లొనరించితి.

రా. సస్మితంబుగ - ఓరీ మూఢా నీకు బుభుక్ష గలిగిన నంతరంబునకేగి యడుగ నిష్టంబులగు నర్థంబులు దేవి యొసంగదా.

వి. సరే బాగుగా నే చెప్పినావు - ఇట్టి నీయవస్థ కట్టి విషాదించు దేవిని నాకాహారంబిడుమని యడుగుటకు నేనంత ఛాందసుండనను కొంటివా - అదియునుం గాక శాసనంబున సిద్ధించుకార్యంబునకుం బ్రార్థించువాఁ డెట్టి వెఱ్ఱి.

రా. ఔరా మంచి వెరపరివి.

వి. ఇంతమాత్రమే చేతఁగాకున్న నతిదుర్లభం బగు నీయభీష్టం బెట్లు సమకూర్ప నేర్పరివగుదు.



వి. సప్రణయ క్రోధంబుగ - కాకున్న మాకుం బ్రతుకుటెట్లు.

రా. ఓప్రియసఖా దానిం గూర్చి యెట్లాలోచించు చున్నావు.

వి. ప్రణయ పరిణామంబగు నమర్షంబున - ఓయీ కొంతసేపూరకుండుమా నేనాకటి కోర్వలేక యెంతో యాలోచించి యాలడ్డుకంబులు దుగ్ధంబుతోఁ గూడరావించికొంటిని. పిమ్మట నెంతో యుపాయంబున దేవికిం దగిన పల్కులు పలికి యిక్కడనుండి వెడలించితిని. ఇప్పుడవి విన నుద్యోగించిన స్వప్నదృష్టయగు కన్యామణి సెజ్జకుం జేరినఁగాని నన్ను భుజింప నివ్వనట్లున్నావు - చాలుచాలు - కొంతసేపూరకుండు.

రా. సాతిహసితంబుగ - ఓరి మూఢా నీవు సర్వదా యుదర పూరణ పరాయణుండవేగదా.

వి. సధార్ష్ట్యంబుగ - బ్రాహ్మణోభోజన ప్రియయను వచనంబు మఱచితివా- ఇది నా నొసటనే విధి వ్రాసెనా.

రా. సస్మితంబుగ - సుబ్రాహ్మణా యథేష్టంబుగ నీలడ్డుకంబుల నాస్వాదించి దుగ్ధంబానుము.

వి. సవికాసంబుగ వయస్యా యట్లు వచింపుము బాగు పిదప నెమ్మదినున్న నన్ను నడుగం గలయను యోగంబుల నడుగుము వచించెద - అంతవట్టుకు నడుమ నడుమ మాటలాడింపకు.

రా. మంచిది - అంతవట్టునకును నీవు విముఖుండవై యుండెడుగాని యిష్టంబు వచ్చినట్టు భుజింపుము.

వి. సవిహసితంబుగ - మహారాజవు నీవట్లుసేసిన బ్రతుకుదును. లెస్స లెస్స యని యట్లొనరించి పరితృప్తి నభినయించుచు వయస్యా యేమంటివి.

రా. నాయభీప్సితంబు ఫలితంబుసేయ వెరవెద్దియైనం జింతించితివా.

వి. అవునుగాని నీవొక్క చెయువొనరింపవలయు.

రా. వయస్యా వచింపుము - దానిశిరంబునం జేసెద.

వి. స్వప్నదృష్టయగు దానియాకృతి యొక్కచిత్రఫలకంబున వ్రాయువలయు.

రా. సప్రమోదంబుగ - మహనీయంబీ యనుశాసనంబు.

వి. అట్లయిన దిష్టంబు నీయిష్టంబు కష్టంబుగ నెరవేర్చునని వితర్కించెద.

రా. నీవితర్కంబు సుతర్కంబగుత - అట్లయిన నాజీవితం బుచితంబగునని నిశ్చయించెద.

అని నిష్క్రమించుచున్నారు.

పిమ్మటం బ్రవేశించుచున్నారు బ్రాహ్మణి సపరిచారికగు దేవియు.

బ్రాహ్మణి. పరిచారికంగని - ఓసీ కనకాంగీదేవి మిగుల నవసియున్నట్లు గానంబడు - కతంబెయ్యదియో.

కనకాంగి. ఔనమ్మా దొరసానిగారు మనంబున నవసియున్నారు.

బ్రా. అందుకెయ్యది కారణంబు.

క. ఏలికగారి యొడలునం గడుబడలిక వొడమె - దొరసానిగారందటి గతితలపంటివారు గాదుకదా - దొరగారిమేన నొక్కింతయైన వెక్కురు గలిగినవారికంటె మిక్కిలి బాధనొందుదురు.

బ్రా. దేవి సతి శిరోమణి రమణైక ప్రాణ సకల ధర్మతత్వజ్ఞ గావున నిట్లుం దవలసివచ్చె - ఆహా యెంతకష్టము - రాజుగారికి నస్వాస్థ్యం బెన్నివాసరములనుండి.

క. పెక్కుసాళ్లి నుండి యమ్మా.

బ్రా. సుధా సదృశంబులగు నౌషధంబులకు సేవధులై ధన్వంతరి సదృశులగు నగదంకారులుండిరి కదా వారియెడ నొడయని కారోగ్యంబు సొంపొంద నొనరింపరేని రాజకృత గౌరవ పోషణ పాత్రత్వంబువలన నెట్లు విముక్తులం గాఁగలరు.

క. అందుకు నేనేమి నుడువఁగలనమ్మా.



బ్రా. దేవి వదనంబున లక్షించుచున్నది.

దేవి. సనిశ్వాసంబుగ - నియతికృతంబులగు శాభీలంబు లనుభవింప కేరికిం బరిహరణీయంబులగు.

బ్రా. దేవి యజ్ఞాన వశంబునసిట్లు తలంచుటయ కాని తత్వదృష్టిం బరికింప నంతమాత్రింబేరాని యొక్కటి యాలోచింపవలయు - జన్మాంతరకృతం పాపం వ్యాధి రూపేణ బాధతే। తచ్ఛాంతి రౌషధైర్దానైర్జపహోమార్చనాది భిరిత్యాద్యభియుక్త పురుషప్రోక్త విధులుశ్రుతి విధంబులై విలసిల్లుచున్నవికదా - మహారాజు గారికీవిధులన్నియు సుకరంబులే - కాకఫలదంబులును - కావున నవియాచరింపఁబడ లేదా - ఆచరింపఁబడియు వితథంబులయ్యెనా.

దే. ఈయెడ నెవ్వియు నొనరింపఁబడలేదు.

బ్రా. ఎందునుండి.

దే. ఆర్యపుత్రుండీయెడ నెందుకు నవకాశంబీకుండుటను.

బ్రా. కొన్ని దినంబుల నేయుపాయంబులైన వినియోగింపఁ జేసెనా.

దే. తొలుతం గతిపయవాసరంబు లౌషధ సేవంజేసె.

బ్రా. తొలుతం బొడమిన తనువికృతం బెట్టిది.

దే. ఒక్కనాడు ప్రభాతంబున మేల్కాని యత్యలస భావపరీతుండై స్నానాదికృత్యంబుల విముఖుండై యుండె - అయ్యెడం జికిత్సకుల రావించి యథావిధ ప్రయోగంబు లొనరింపించితి - అయితే నారినవన ప్రకారంబు మితాశియై యుండవచ్చునా యట్లుండలేదు.

బ్రా. దేవి భవద్వచన సాధవంతుండకదా యానృపశిఖామణి.

దే. ఔను నిక్కంబకాని యియ్యెడ నానుడువుం గరుణింపఁడయ్యె నేనుం గేవలాహార స్వీకారాభావం బయ్యెనేనిం దద్దయుం గృశుండగునని యొత్తి వచింప వెఱచితిని.

బ్రా. ఈయెడ నౌషధసేవ సలుపుచుండెనా.

దే. లేదు.

బ్రా. అందుకెద్ది నిదానంబు.

దే. అట్లుండ నొక్కనాఁ డేకాకినై యనుగాయిలగు ననుచరవర్గంబు మరలించి మృగయావినోదంబు సలుపుచుసని నాతోఁ బలికి పకియ యొక్క మహాశ్వం బారోహించి చనియె - మరలి రాత్రి యందు సార్ధయామం బతీత ప్రాయంబుగాఁగ నేతెంచి యాయశ్వంబువలన నవరోహించి సంఘటితేకవాటుండై యహర్మ్యాంతరంబున నుండెనట అంత నశ్వపాలకుం డేతెంచి యాయశ్వం బతిమాత్రఖిన్నంబుగాఁ దలంచి తగిన యాహారంబిడి దాని సంరక్షించెనట మరువాఁగు దినకరుండు దితుండైన కొంతతడికి లేచి యశ్రాంతోల్లసత్క్రాంతుడగుచు నాత్మీయ దర్శనాగతులైన భిషగమాత్యాది వర్గంబునకు పరేకదా నాకును నానియమంబువీడి రాఁగూడదని శాసనంబు విదితంబు సేసె.

బ్రా. ఆహా యెంత ప్రమాదంబు పస్థితంబయ్యె - మహారాజునిసర్గంబున శిరీషకుసుమ సుకుమార శరీరుండును సౌందరీ వధీరిత రతిరమణుండు - ఇట్టివాఁడు నవసి మహారణ్యంబు సారఁదగునే - ఆయరణ్యం బతిమాత్ర దృప్త క్రవ్యాద బలాత్కార సంహత మహాభూతంబై యుండుట బహువిధ గ్రహాశ్రయంబునగు - ఈయెడ నీ మహారాజతి ఖిన్నుండై యుండెఁగావున నెద్దియైన నీయన నావహించి యుండవలయు కాకున్న నిట్లాహారాది పరాఙ్ముఖుండై యుండునా.

దే. సవితర్కంబుగఁ బరిచారికం గాంచుచున్నది.

ప. అడఁకువమరరాణిగారూ డెందమునం దలంపుఁడు ఈయమ్మగారు వినిచిన పలుకును నిక్కంబై యుండు - జగంబున నిట్టి సుద్దులు గలిగేయున్నవి.

దే. సుబ్రాహ్మణి నీవచనం బాదరణీయుంబై యుండు - అదియు నాఁలోచింపవలసినదే - దీని నిక్కంబు తెలియుట కేమియుపాయంబు.

బ్రా. దేవీ మంత్రోపాసనాది పళంబున నితరమనోగతార్థ నివేదన సమర్థులగు విప్రశ్నిక లక్కడక్కడ నుండుదురు - కావున వారిరావించి యనుయోగింప దీని తత్వంబు విదితంబగు.



దే. స్వ. ఇద్దియు నాశ్చర్యకరంబై యుండు - వనుక విదూషకుండు నిట్లు చెప్పె అంతమాత్రంబకాక బలిసమర్పణంబున బహువాసరంబుల నాహారాదిపరాఙ్ముఖుండైన యార్యపుత్రుండు శాసంత ప్రకృతిం జెందియుండె అయ్యోయిదివఱకు నేను గానకపోతిని - ఇద్దియుతెధ్యంబు కావచ్చు - కావున దీనికిం దగిన ప్రతిక్రియఁ బరికింపవలయు. ప్ర. ఔను నీవచనంబు లెస్సఁగ నున్నది - అట్లొనరింతమని పరిచారికం గాంచి ఓసీ చంపకవల్లీ నీవు రచ్చకేగి విప్రశ్నిక లెవ్వరైనఁ గానంబడుదురేమో కాంచిరమ్ము.

చంపకవల్లి. ఏలికరాణిగారి యానతి తలపూనని నిర్గమించుచున్నది.

బ్రా. స్వ. ఆర్యపుత్రుండు మాతరాయనుని విప్రశ్నికావేషధారింజేసి పనుపందలఁచి తత్ప్రవేశానుకూల్య సంధానంబుకైనన్నుఁ బనిచె ఈయెడ వాఁడూరకున్నను గాక మఱియొకతె యేతెంచి పెరకరణిం దల్పినను నీయుద్యమంబంతయుఁ గాణనయనాంజనాలంకరణంబు కరణి మోఘంబగుఁ గదాయని చింతించుచు దేవీ వ్యసనానుకరణం బభినయించుచున్నది.

మఱలఁజేరుచున్నది చంపకవల్లి.

చం. దేవి చాల పరికించి యేతెంచితి - తొలుత నెఱుక నొందిన వారెరును గానంబడలేదు - కాని యొక్కయాపె జడదారి కప్పురంబుకంటెం దద్దయచ్ఛంబగు బూడిద పూసుకొని కావి చీరెఁగట్టి తావలంబుల మెడనూని బికిరంబు తట్టి కేలందాల్చి యీవీదిన యేతెంచుచున్నది - ఈసుద్ది తమతో మనవి సేయుదునని గ్రక్కన నేతెంచితి.

బ్రా. స్వ. హా యార్యపుత్రుని యత్నంబు ఫలితంబయ్యెనని సంతసించుచు నభిలాష విషయార్థ లాభజత్వచ్ఛలంబున దానిం బ్రకాశింపఁజేయుచున్నది.

దే. కొంచెము పరికించి - సుబ్రాహ్మణీ యిట్టివారిలో విప్రశ్నికులుండరా.

బ్రా. దేవీ యిట్టివారికి విప్రశ్నికాత్వంబన నెంత - వీరు మహా యోగినులని తోఁచుచున్నది.

దే. వారిలో విశేషంబు కలదా.

బ్రా. దేవీ యోగినులకు విప్రశ్నికులకుం గంగాకుల్యలకుం బోలె మహత్తార తమ్యంబుగలదు - దేవీకృతార్థవైతివి - విప్రశ్నికాన్వేషణంబు సేయ యోగినీ సమాగమనంబగుట భైషజ్యార్థంబు నోషధుల నన్వేషింపువానికిం దత్ప్రకృతిక దివ్యౌషధ లాభంబుగదా. మఱియును అవ్యాక్షేపో భవిష్యంత్యాః కార్యసిద్ధేర్హి లక్షణమ్మను నార్యవచనమ్మున నిది మహిత మంగళ నిదానంబు.

దే. సవికాస వదనయగుచు - చంపకవల్లీ నీవు సత్వరంబుగ నేగి మద్వసనంబున నాపెను దోడ్కొని రమ్ము.

చం. దేవి యానసూన కుతుకరాయని యట్లొనరించుచున్నది.

దే. ఆయోగినిం గనుంగొని ససంభ్రమ కృతోత్థాన యగుచు భగవతీ యీ పీఠం బలంకరింపుము.

యోగిని. అట్లొనరించుచున్నది.

దే. భగవతీ స్వాగతంబుగదా.

యో. దేవీ భవత్ప్రసాదంబున.

దే. భగవతీ నీకు సుఖంబుకదా.

యో. దేవీ భూతమయంబగు ప్రపంచంబు పశలసంతంబగునంతకు మాకు దాని లోపంబు గానంబడదు.

దే. స్వ. ఇట్టి మహితాత్ములకు సర్వభూతంబులం దాత్మభావంబు పరిపూర్ణంబై యుండు - కాకున్న యిట్లు వచించునా. ప్ర. భగవతీ అనాద్య విద్యావరణ నిరాకరణం బొనరించుటం బరిస్ఫుట ప్రద్యోతంబగు నాత్మజ్యోతి స్ఫురణంబున సము



న్మీలిత తమస్తోమగంధంబులగుట నతిప్రసన్నంబులగు మానసంబుల విలసిల్లు మహామహుల కానంద సందోహంబు నిష్పందంబ యగుచున్నది.

యో. సాశ్చర్యంబుగ - ఆహా దేవి కుసుమశయనీయాజననం బవిదిత విషయానుభవ లేశంబులై యింద్రియ సంరోధంబులన నేమరక మఱిమఱి తపస్సమాచరణ కర్శిత శరీరంబులై వర్తిల్లు జనంబులకెల్ల దుష్ప్రాపంబగు నర్థంబు మనోహర తారుణ్య శరణ్యాంగివియు మహారాజ పత్నివియునగు నీయక్షేకిత సుధావిధంబులగు సంభాషణంబులు శ్రవణానంద గుణులగుట నజస్రం బాశ్చర్యంబగు - ఆహా నీవిజ్ఞాన విభవంబు.

దే. భగవతీ యిట్లు వచింప మాదృశజనం బెంతమాత్రంబు - అప్పుడప్పుడు నైసర్గిక కరుణా సమాగత భవాదృశయోగినీ మణుల ననుగ్రహించిన వచనంబులం గొంచె కొంచెము తెలిసికొని యిట్లంటిని గాని నేనేమియుం దెలియనేర.

యో. దేవి నీవు సంక్షిప్త యాత్మ నగుట మాదృశజనంబుల గారవించుట నీకు నైసర్గిక గుణంబ - అయిన నీయెడ మదీయాహ్వానంబు సకారణంబని స్ఫురించుచున్నది - మఱియు పరిశ్రాంతయునైతి కావున ప్రస్తుత్యాంశం బనుయోగింపందగు.

దే. భగవతీ భవాదృశ నిర్వ్యాజ కృపావలోకనంబునన తరణి కిరణ ప్రసరణంబునం దామరస సంకోచంబు కరణి మాదృశజన విపదంబు లపదంబులై నశించు - మఱియు నభిమత శ్రీవిలాసంబులును విలసిల్లు - అయిన నీయెడను పస్థితంబైన కష్టంబతిదుష్టంబుగావున వచింపవలయు - అయిన నీపశ్చాత్తాపంబు సైతము భగవతియ సులభిచ్చెనేని ప్రతీకార విధియందు మామకీన మానసంబ జస్రవిశ్వాసాశ్రయంబగునని యుత్సహించెద.

యో. దేవి నీయుక్తి యుక్తి యుక్తంబ - నీయభిలాషం బట్టిదేని యట్లు వచించెద - అని తోడెంబుటలి ధ్యానాధీన మానసయై యించుక కాలిక కుశేశయ పలాశవేశా వేశనంబులగు నయనంబులకుం బ్రమీలనాసాన వలినపలికేళి తళతళలకు నళిందత నలవడంజేసి వచించుచున్నది - ఓ దేవీ భవదనుయోగంబు విషణ్ణరమణ క్షేమ విషయంబు.

దే. భగవతీ యావిషణ్ణతకిం నిదానకంబు.

యో. గ్రహావేశ నిదానకంబు.

దే. ఆగ్రహం బెయ్యెడ నావేశించె.

యో. మహారణ్యాంతరంబున.

దే. ఆర్యపుత్రుండచ్చటికేగ నేద్దికతంబు.

యో. లోగడ నొక్క కతంబునం గలుషిత చేతస్కుండై కాలవినోదంబు సేయఁగోరుట.

దే. ఆగ్రహం బెయ్యది.

యో. రాక్షసగ్రహంబు.

దే. అయ్యదేమి కామించి యార్యపుత్రు నావేశించె.

యో. వైరనిర్యాపణంబు.

దే. వైరంబున కేమి కారణంబు.

యో. ప్రాక్తనతను వియోజనంబు.

దే. దానికెయ్యది మూలంబు.

యో. ఈభూరమణ చూడామణి యార్తజన సంత్రాణ పరాయణుండగుట.

దే. ఆగ్రహంబు ద్రోలుతం గిమాత్మకంబు.

యో. నక్తంచరాత్మకంబు.

దే. ఆనక్తంచరుండెట్టివాఁడు.

యో. మహాబలమాయా నిలయుండు.

దే. అట్టివాని సమయింప నార్యపుత్రుండొక్కండశక్తుండయ్యెనా.



యో. తదీయా యురవసానంబు పాసట ముగుటం డాదృశుండయ్యె.

దే. అత్తఱి నిరువురకుం గొంతదూరంబు దురంబయ్యెనా.

యో. ఘోరతరంబగు సమరంబయ్యె.

దే. అయ్యంతరంబున నార్యపుత్రుండు పరప్రహరణ ప్రహారంబుల నిపీడిత గాత్రుండయ్యెనా.

యో. తత్ప్రహారంబుల కితండు శరవ్యంబయ్యెనేని యిట్లుండు టెట్లు.

దే. అట్లయిన నర్వారవాణుండగు నార్యపుత్రునకుం దద్వ్రణం బెట్లు గలిగె.

యో. సాధ్వీమణీ యెయ్యెడం భవదీయ సౌభాగ్య మహిమాలంకృతంబగు తదీయ సుకృతంబ వారవాణంబగుట తదీయ హాయంబు తదధిష్ఠితంబగుటం దత్ప్రహరణప్రహార జర్జరిత శరీరంబయ్యు నాయుష్మంతుఁడయ్యె.

దే. ఆగంధర్వం బీయెడ కెట్లుండె.

యో. ఆసైంధవం బిదివరకును నాళ్యాన ప్రాంగణంబె.

దే. సాశ్చర్యంబుగ - ఓయిక్కడ నెవ్వతె.

కంచుకిని. యేతెంచి - యేలికసాని యానతి దండనూన శిరసుడద్దయుఁ జెలమి గోరుచున్నది.

దే. నీవేగి వేళంబ యార్యపుత్రుండారోహించు వాహంబు కుశలంబుగనుం గొనిరమ్ము.

కం. దేవి యానతి విరసరిఁ దలకై సేతగవాయెనని నెలువడి యట్లొనరించి వెండియు నేగుదెంచి ఓయేలికసాని గాకూ విమండమ్మావు మెయినిండ గాయంబులు గ్రమ్మియున్నవి. ఇది యేమని యడిగిన నాసాహిణి యానాడుమం దొరగారు దీని నెక్కి యడవికి వేటకై వెడలినారు - వెండియుఁ గొంతరేతిరరుగ విజయంచేసి యుప్పరిగెలోనికి వేంచేసినారు - పిమ్మట నేఁజూడ నిస్తేజయిట్లు కానుపించె - దానికి మందులిచ్చుచుం గాపాడుచున్నానని నుడివెనని వాకుచ్చి తన తావు కేగుచున్నది.

నింగికెగయుచు నేలదుస్సిన చర్మనాగిత సురతరుణీవదనంబులం గని సముదిత సుధా
కర బింబభ్రాంతులై వానిమ్రింగ గనుక్కొనుచుట్టి వియుపఫణాతల సంయూథమణి ఘృ
ణీగణ విశీర్ణ ధ్వాంతంబులు నగు నక్షత్రమాలలం బోలుచున్నవి. సురుచిరహీర ప్రభా
నికర చోరంబులగు వెన్నముద్దల సర్వాలంకార విభూషితయు క్రొత్తపెండ్లికూతు
రగు నీవయస్య నాలోకించి మింటికెగయు తారలంబోలి విలసించుచున్నవి. మత్తా
బులుందమ్ముంజేసినవారి నేర్పుపెంపునం బొగలేమిని నయనానంద కరంబులై దుర్గం
ధంబులేమిని నాసాబాధానహంబులుం గాక విడివిడి యేతెంచు విశదకర కరనికరంబు
ల లీలమెలంగుచున్నవి. మరియుంగొన్ని బాలాతపంబు విలాసంబు సలుపుచున్నవి.
మరికొన్ని మరకతమణిహాసల ప్రభాపటలంబుల వెదజల్లుచున్నవి. మరియుంగిర్మిక
రకరధార్యమాణ కరదీపికా నికరంబులు నిరస్త తమస్తోమంబులై సమస్తదిశలం దేజో
మయంబులం గావించుచున్నవి. మరియుం జిత్రకర నిర్మితంబులగు కదళీరసాల పు
న్నాగాదితరులు పల్లవపలాశముకుల కుట్మలబాలశలాటు శలాటు పరిణిత శలాటుఫలం
బులం గృత్రిమంబుల నొప్పారుచున్నవై యింతకు మున్నులోచనంబులకుం గోచరంబు
లుగాని సంతసంబుల వింతగాంగ వెలయించుచున్నవి. మఱియుం గర్పూరసమేధితేం
ధనంబులగు ధనంజయంబులు మత్తాబులంబోలి పరనయనాథ సమాధాయకంబులగుటం
దమకేతనంబులగుధూమంబులవిడిచి యధిగతకవిరుచిరుచిరంబులగుచు వెలుంగుచున్నవి.
బలభిదుపల మయవిపులాధరంబు పురోభాగ తిర్యక్సం ప్రరూఢహారమయ శిఖరద్వ
యంబయ్యెనేని మఱియు నిజకాంతి పిహితాశాంతర నానాధాతుప్రవాతావృతంబగునే
నిపృష్ఠసముదిత సుందర కందర విరాజమాన హిరణ్మయ శృంగ సంగత మంగళం
బయ్యెనేని దీనియుద్దినొందునను బుద్ధినిద్ధంబుగ నద్దించునని గొండాడందగు మతంగ
జంబుమీదం గల్పించిన చొడ్డోలునడుమం గామరూపియగు నీరధరాంతరంబున నచ
లతవెలయు సైరంవతింబోలి దేవీ వయస్యా మధ్యగతయగు టంబ్రభూత్సాహశక్త్యం
తర్గతయగు మంత్రశక్తికరణి స్వాహాస్వధామధ్యగత యగు ధనంజయ జ్వాలబోలెభూ
సళాంతర్గతయగు శ్రీదేవింబోలి నీవయస్య విలసిల్లుచున్నదని పచింపుచు నంతటం
సానందంబుగంజూచి ఓయీ వయస్యా యనపరతపూత భీ జర్పితి హావిష్యంబునం
బీనతనువగు శతక్రతుండు కృతఙ్ఞుండు గావున నీయందలి నెలమింబంపిన నచ్చ
రల కరణి మెలంగుచున్న వారముఖ్యలు సఖ్యంబునవలె ముఖ్యంబులగు లాస్య



ప్రచారంబుల నవహితలై నవహితలైన తెలుంగు నలాస్యరహస్యంబుల వెలయించుచు
న్నారు. మఱియు నజునింబు రణించు ద్విజకుంజరంబులందఱు మంజుళంబులగు నిగ
మ వచనంబుల మంగళవచనంబుల నఖిలనివదంబుల జిందరవందర నొందించుచున్నా
రు. నీకీయెడం బొడమిన హర్షాయాలు పోలుచున్నవానివలె నా నెల యుదయంబున
నుదయంబునొంది హీరమయంబగు శేఖరంబగుచున్నాడు. మఱియు నీమతంగజత
ల్లజంబు మస్తునీటం గఱంగిన సిందూర బిందువుల నిటువలె మీరు నేతదుత్సవాంతరం
బున వసంతోత్సవంబు చేసికొనుడని నుడువు నదివలె వెదలింపం జేయుచున్నది. మ
ఱియుం బరిభాగ కలధౌత పత్రి చిత్రమాలికల నొప్పారుచు విద్యుల్లతావలయిత నీ
లాచల శిఖరలాలితం బోలుచుచున్నది. దేని యుట్టిసన్నాహం బొనరించినది. కావు
న నీచెలియందు పదితసోదరీ భావనయై మిపలుగ నర్మిలిగలదై వెలయుచుండెడు దయా
దాక్షిణ్యంబులు లేకున్న నేతాదృశోత్సవ సంధానం బెట్లుసేయు మీకుం బరిణయంబు
గావించుపరకు నీరంజైనం జేకొననను బ్రతినయేలపూను. కావుననా దేవి మనోవాక్కా
య క్రియల మీకు నభీప్సితంబ సేయుంగోరె. నీబొబ్బట్టు నేతిలోం బడ్డదిగదా చిం
కంబునుర బొంకంబుగ నుండుము.

రా. స్మితాలంకృత వదనుండగుచు. ఓయీ వీరుచరణంబులం బుతః పసరణం
బులం జేయుని వారికరణినుండిరి. అక్కడనుం డిక్కడకు వచ్చుటకై యింతసేపు
పట్టునా.

వి. పకపక నగుచున్నాడు.

రా. ఓయీ యేమిట్లు నగుచుంటివి.

వి. ఒకమాట మతింజేరి నగవువచ్చినది.

రా. అది నేవినందగినదేని వచింపుము.

వి. ఓవయస్యా నీకు దాపరికంబు సేయందగిన దొకటిగలదా.

రా. అట్లేనచింపుము.

వి. సహాసంబుగ ఒకడు పదునెనిమిది యేండ్లులకు లొంగడనే నూరామడ
లెడమగల దేశంబునకుంజని మరలి తనయూరి చెంతకుంజేరి పరుగెత్తెనట. అంతట
నొకండు దానింగని యోయీ యొంగులకిట్లు పరుగెత్తెదవని యడుగ నతడు మావా
రింగని చిరకాలంబయ్యెం గావునం దొందరగి నడచుచున్నానని వాక్రుచ్చెనట.
మనంబునకు రాంగనగవేతెంచె.

రా. ఓయీ యీయెడ నీసద్బుద్ధిజేరుటకుఁ గతంబెద్దియైనం గలదా.

వి. కారణంబులేకున్నఁ గార్యంబుపుట్టునా!

రా. అందులకుం గారణంబేమి.

వి. నీవ దానికిం గారణంబు.

రా. అదెట్లు.

వి. ఇన్నిదినంబులు దేశీభయంబున నాపయస్యం జూడనేరక యిపుడు విదితవృత్తాంతయగుట పశ్చాత్తాపపరీతయై యాపెనీకు సమర్పింప నేతెంచుచుండ గనుచుండియు నాపెవిరహంబు సహింపనోపక యిట్లు వేగిరపడుచున్నావు. ఇందువలన నది చేతంబునకు వచ్చె.

రా. సస్మితాపత్రపంబుగ. ఓయీ వారినడకం గని యిట్లాడితింగాని తత్సంగమత్వరిత చేతనుండనై యుండుటలేదు.

వి. నీమనంబు నేనెఱుంగుదునులే నాతోడనున్ నిక్కంబు పలింపవుగదా. నీయభిమతంబునకే ననభిమతుండనా దానినిక్కంబు నీకే దెలియును.

రా. వయస్యా నీకుందాపఁదగిన మనోగతంబైన యరతం బొక్కింతయు లేదు కావననామాని పచింతును. దేవియూచెలిని నిర్బంధించినది మొదలు దానినెప్పుడు గనుంగొనుదునని మనంబు వువ్విళ్లూరుచున్నది.

వి. ఓయీ యిదియుచితంబ. ప్రియజనంబునకు నాపద గల్గినం దద్విమోక్షణంబైనను నెప్పుడు వానింజూతునని యభిలషించుట మహాత్ములకు నైసర్గికంబగు ధర్మంబుగదా.

రా. దివాతన వికర్తన సంజాత ప్రతాప శోషితాత్మంబగు చకోరంబల చందమామంబోలి తదీయవదన సందర్శన త్వరమాణ చేతనుండగుచు విమానక మాత్రసహాయుండై నిరీక్షించుచున్నాఁడు

దే. తాదృశుండగు రమణు నిరీక్షించి యంబారివలన దిగి యభిముఖంబుగ నేతెంచి మంజరినిం బ్రణతియొనరింపుమని వినిచి బ్రమొక్కించి వినీతాత్మయగుచు.

ఆర్యపుత్ర విజయంబునొందుము విజయంబునొందుము. మనయాలభాగ్యంబు వలనఁ జిన్నమ్మపంపిన యక్కమ్మ నాతావునకుం జేరెఁ గానదీనికి నాకుం జిరకాలంబు



మనికియింపొందె. ఇంతకు నపయశంబు నాకుం బొడమకుండ నాకమ్మ యుగ్గోడపాలకుం దోలుత నేతెంచె. దీనమనమందఱము వెలలేని లగ్గలకై పాల్పడియున్నారము. కావున సంశయంబు వీడిదీనిఁజేకొమ్ము. ఈమీద దేవీశబ్దంబు దీనికిం భట్టినీ శబ్దంబు నాకునుంగలుగుఁగాత మని మంజరికరంబు ప్రియునికరంబున నునిచి యింకనీయెడ నే యభిమతం బొడఁగూర్తును.

రా. ప్రసన్నవదనుండగుచు.

గీ॥ తొలుతఁ బొడమినకోపంబు త్రుంగణంచి। యాదరంబున దానినాయాలుఁ జేసి। మోదమొనరించితివి నీవుముదముతోడ। నింతకంటెను బ్రియమెద్ది యిపుడు చెపుమ ॥ ౧౦౨ ॥

అయిన నీభరతవచనంబగుఁ గాత.

గీ॥ సకలజీవులు సంపూర్ణసౌఖ్యులగుచు। దైవతానుగ్రహంబున ధైర్యమమర। చిరసమంచు మునుహిత బుధసేవులగుచు। మను మనుందురు గావుత మహిమమీర.

ఇట్లని యథోచితంబుగ నందఱు వెడలుచున్నారు.

ఇద్ది చతుర్థాంకము.

ఇది శ్రీసకల మునిజన మండల మండనాయమాన కౌండిన్య
గోత్ర ప్రభవ శ్రీకోరాడ రామచంద్ర కృతం
బగు మంజరీ మధుకరీయంబు
సంపూర్ణము.






